ప్రజాపక్ష

# సమీక్ష

జనవరి 16 - 31, 2003 సమతా పబ్లికేషన్స్ ప్రచురణ వెల రు. 5-00

గౌరవ సంపాదకులు :
ఎబికె ప్రసాద్
సంపాదకులు :
వి. హనుమంతరావు
సలహా మండలి :
ప్రొ. ఆర్.వి.ఆర్. చంద్రశేఖర రావు
ప్రొ. వకుళాభరణం రామకృష్ణ
ప్రొ. పి. నారాయణ రెడ్డి
డి. పాపారావు
బి. సాంబశివరాజు
ఎన్. వేణుగోపాల్

లోపలి పేజీల్లో.....



వార్షిక చందా రూ॥ 120/-లు

Edited, printed and published by
**V. Hanumantha Rao**
for **Samata Publications**
D.No. 8-3-898/22, Road No.3,
Nagarjuna Nagar,
Hyderabad - 500 073.
Phone : 23748672

DTP at : Sri Sai Shamili Graphics
Golnaka, Hyd. Ph. 2756 9274

Printed at : Charita Graphics
Chikkadpally, Hyderabad - 020.

సంపాదకీయం

## ఆసియా సామాజిక వేదిక : బొమ్మా బొరుసూ

ఆసియా సామాజిక వేదిక మేళా ముగిసింది. 15 వేలమంది పైగా ప్రతినిధులు వారి వారి రాష్ట్రాలకు, దేశాలకు తిరిగి వెళ్ళిపోయారు. ప్రపంచీకరణ ప్రమాదం గురించి పత్రికలు ఒక వారం దినాలపాటు విస్తృతంగా వార్తలు, ఉపన్యాసాలు, అనుభవాలు ప్రకటించాయి. ఇంత పెద్ద ఎత్తున ప్రచారం జరగటం మంచిదే కదా అన్నప్పుడు హైదరాబాద్ నగరంలో ఇంతకన్నా రెండు మూడింతల ప్రజలు పాల్గొన్న సమావేశాలకు ఇందులో వందోవంతు కూడా వార్తలు ప్రచురించని పత్రికలు ఎందుకు ఈ సమావేశానికి ఇంత ప్రాముఖ్యత ఇచ్చాయి అనే ప్రశ్న ఎదురైంది. ఆలోచించాల్సిన విషయమే.

దేశంలో, రాష్ట్రంలో ప్రముఖులైన వామపక్షమేధావులు ఎంతోమంది ఈ సమావేశాల్లో పాల్గొన్నారు. వారిలో అత్యధికులు ప్రజా ఉద్యమాల్లో పాల్గొన్నవారు. కష్టనష్టాలననుభవించినవారు, చేయూత నిచ్చినవారు, ఎటువంటి మచ్చాలేని చరిత్రగలవారు వున్నారు. వారందరికీ ఈ వేదికను వెనుకనుంచి బలపర్చిన శక్తుల గురించి తెలియకపోదు. ఆ శక్తులెవరయితేనేమి, ప్రపంచీకరణ ప్రమాదాన్ని మరోసారి ఎత్తిచూపుతున్న వేదిక నుంచి దూరంగా వుండటం కన్నా, పదిమందితో గొంతుకలిపి, సామ్రాజ్యవాద ప్రపంచీకరణను మరోసారి ఎండగట్టే అవకాశాన్ని జార విడుచు కోకూడదని భావించివుండవచ్చు.

కాని రూపాయికి బొమ్మా, బొరుసు వుంటాయి. ఈ వేదిక ఉపన్యాసాలకే పరిమితమైంది. ఇన్ని డజన్ల సెమినార్లు, వర్క్‌షాపుల్లో ఏ ఒక్కరూ ఒక చర్చా పత్రాన్నయినా ప్రవేశపెట్టలేదు, ఏ సమావేశమూ ఒక తీర్మానం చేయలేదు. సదస్సు ముగిసిన తర్వాత నిర్ణయాలివి అని అనుకోవడానికి ఏమీలేవు. కార్యాచరణకు పథకం లేదు, పిలుపూ లేదు, రాష్ట్రంలో పత్రికలు తప్పిస్తే, ఈ చర్చల వివరాలు దేశంలోని ఇతర ప్రాంతాల్లో ప్రచురించే పత్రికల్లో ప్రచురింపబడ్డాయో లేదో తెలియదు.

ఈ వేదిక నిర్ణయించటానికి అయిన ఖర్చులో అయిదు శాతం మాత్రమే బహుళజాతి సంస్థ ఫోర్డ్‌కంపెనీ సహాయపడిందని నిర్వాహకులే అంగీకరించారు కాని, సమావేశాల్లో పాల్గొన్న ఎన్ని ఎన్జీవో సంస్థలు విదేశీ సంస్థల నిధులతో ఈ సమావేశాలకు వచ్చారో బహుశా నిర్వాహకులకు కూడా తెలియదు ఆ సంస్థలు ఈ సమావేశాన్ని డామినేట్ చేశాయి. ఎందుకు? అనుమానాస్పదమైన ఈ నేపథ్యం మేధావులకు ఇవాళ కాకపోతే రేపయినా ఆలోచింపచేస్తాయి.

ఏమైనా, ఈ వేదిక సమావేశాలు ప్రపంచీకరణ నిజస్వరూపాన్ని బట్టబయలు చేయడానికి పరిమితంగానైనా తోడ్పడ్డాయి. ప్రజల్లో వచ్చిన చైతన్యాన్ని మరింత ముందుకుతీసుకుని పోయి, రాష్ట్రాన్ని; దేశాన్ని రక్షించుకునేందుకు వారిని కార్యోన్ముఖులను చేయాల్సి వుంది.

## రెండురెళ్ళు నాలుగు

### దేశంలో మౌలిక సదుపాయాల సూచి

| | మౌలిక సౌకర్యాల సూచి* | పెట్టుబడుల్లో రాంకు** |
|---|---|---|
| గోవా | 200.57 | 25 |
| పంజాబ్ | 187.57 | 14 |
| కేరళ | 178.68 | 10 |
| తమిళనాడు | 149.10 | 3 |
| హర్యానా | 137.54 | 12 |
| గుజరాత్ | 124.31 | 2 |
| మహారాష్ట్ర | 112.80 | 1 |
| పశ్చిమబెంగాల్ | 111.25 | 8 |
| సిక్కిం | 108.99 | 24 |
| కర్నాటక | 104.88 | 4 |
| ఆంధ్రప్రదేశ్ | 103.30 | 5 |
| ఉత్తరప్రదేశ్ | 101.23 | 7 |

* పదవ ప్రణాళిక రిపోర్టు నుంచి

** సి.ఎం.ఐ.ఈ. ఎకనామిక్ టైమ్స్ 10 జనవరి, 2003

### వివిధ రాష్ట్రాల్లో తలసరి వినిమయఖర్చు

(రూపాయలు)

| | తలసరి వినిమయ ఖర్చు | | నిష్పత్తి* | |
|---|---|---|---|---|
| | 93-94 | 99-00 | 93-94 | 99-00 |
| ఢిల్లీ | 777 | 1316 | 0.52 | 0.43 |
| పంజాబ్ | 457 | 792 | 0.43 | 0.41 |
| మహారాష్ట్ర | 372 | 697 | 0.37 | 0.37 |
| హర్యానా | 408 | 768 | 0.44 | 0.43 |
| గుజరాత్ | 357 | 678 | 0.44 | 0.44 |
| తమిళనాడు | 344 | 681 | 0.46 | 0.44 |
| కేరళ | 419 | 817 | 0.63 | 0.54 |
| హిమాచల్‌ప్రదేశ్ | 386 | 738 | 0.59 | 0.50 |
| కర్నాటక | 318 | 639 | 0.49 | 0.46 |
| ఆంధ్రప్రదేశ్ | 322 | 551 | 0.52 | 0.44 |
| రాజస్థాన్ | 347 | 611 | 0.57 | 0.56 |
| జమ్ము-కాశ్మీర్ | 407 | 747 | 0.75 | 0.73 |
| మధ్యప్రదేశ్ | 290 | 479 | 0.53 | 0.51 |
| అస్సాం | 280 | 473 | 0.59 | 0.58 |
| ఉత్తరప్రదేశ్ | 298 | 517 | 0.71 | 0.67 |
| ఒరిస్సా | 246 | 414 | 0.62 | 0.57 |

* తలసరి ఆదాయం - తలసరి ఖర్చు నిష్పత్తి సి.ఎస్.వో., జాతీయ మానవాభివృద్ధి నివేదికల సూచి

## సమీక్షా సమీక్ష

మీ 'ప్రజాపక్ష సమీక్ష' ప్రథమ సంచికను పంపినందుకు కృతజ్ఞతలు. నా వంతు ఉడతాభక్తిగా రూ.1,120/-లు చందాగాను మూల ధనంకి వుపయోగంగానూ వుంటుందని చెక్కు జతపరుస్తున్నాను. విమర్శనే ధ్యేయంగా వుంచుకుని పత్రికని నడపడం సముచితంకాదేమోనని నా అభిప్రాయం. చెడును దుయ్యబట్టడం ఎంత అవసరమో, మంచిని వెన్ను తట్టడం కూడా అంతే అవసరం. కొన్ని కొన్ని ప్రాంతాల్లో, కొన్ని కొన్ని సందర్భాలలో ప్రజలనుంచి కొన్ని ఔత్సాహిక విధానాలకు మంచి స్పందన ఏర్పడుతుంది. వీటిని కూడా అప్పుడప్పుడు చెబితే విధానాల తప్పొప్పుల పట్టిక తేటతెల్లంగా వుంటుంది. సంపాదకులలో సాటిలేని జంట మీరూ, ఎబికె. 'సమీక్షా సమీక్ష'లో నమూనా సంచికను చదివిన అదృష్టవంతులు సూచించినట్లుగా ఈ మీ పత్రిక త్వరిత కాలంలోనే తెలుగువారి 'ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ'గా రూపుదిద్దుకోవాలని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను.

**- డా.బి.ఎర్రంరాజు,**
**హైదరాబాద్**

మీ ప్రయత్నానికి నా చేదోడుగా రు.900/- చెక్ పంపిస్తున్నా.

**-డా.పి.వి.ఆర్.భాస్కరరావు,**
**హైదరాబాద్**

# ఆసియా సామాజిక వేదిక

- డి.పాపారావు

వర్ధమాన దేశాలను రుణాల ఊబిలో దింపి సామ్రాజ్యవాదులు నయావలస వాదానికి తెరలేపిన యుగం మనది. వలస వాద దశ ముగిసిపోయిన తరువాత నేటి వరకూ ఇటువంటి పరిస్థితి కోసమే సామ్రాజ్యవాదులు పడరాని పాట్లు పడుతున్నారు. 1970 వ దశకపు చమురు సంక్షోభం ఈ సామ్రాజ్యవాద కుట్రకు కలిసి వచ్చింది. అప్పటివరకూ విదేశీ వాణిజ్యంలో మిగులును సాధించిన అభివృద్ధి చెందుతూన్న దేశాలలో అకస్మాత్తుగా పరిస్థితి దిగజారి పోయింది. చమురు సంక్షోభం ద్వారా పెట్రోలియం ఎగుమతి దేశాలు గడించిన లాభాలు పాశ్చాత్య దేశాల బ్యాంకులలోకి చేరాయి. అవి బడుగు దేశాలకు రుణాలను ఇచ్చే పెట్టుబడుల రూపం ధరించాయి. అదే సమయంలో ఆర్థిక మాంద్యంలో వున్న పెట్టుబడిదారీ దేశాలకు ఇది లాభించింది. ఈ చేతితో రుణాలు ఇచ్చి మరో చేతితో బడుగు దేశాలలో తమ సరుకుల అమ్మకం ద్వారా లాభాల రూపంలో డబ్బును తరలించుకుపోవడం వాటికి అనుకూలించింది. పైగా ఈ క్రమంలో బడుగు దేశాల తాలూకు అవినీతిమయ పాలకులు, పరిపాలనా యంత్రాంగం కూడా ఈ సామ్రాజ్యవాద దేశాలకు అనువైన పరిస్థితి కల్పించారు. ఈ పాలకులు, అధికారగణం అవినీతి నిధులు మరలా తిరిగి పాశ్చాత్య దేశాల బ్యాంకు ఖాతాలలోకే పోసాగింది. ఈ క్రమంలోనే ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణలకై సామ్రాజ్యవాద దేశాల జేబు సంస్థలైన ప్రపంచబ్యాంకు/అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలు బడుగు దేశాలపై వత్తిడి తేసాగాయి. ఫలితంగా వ్యవస్థాగత సర్దుబాట్లు (ఎస్.ఎ.పి.) కార్యక్రమాలలోకి పలు బడుగు దేశాలు లాగబడ్డాయి. రీగనామిక్స్, థాచరిజం పేరిట అమలు జరిగిన ఆర్థిక విధానాలు సామ్రాజ్యవాద పెట్టుబడి దారీ దేశాలను కూడా గుత్త సంస్థల దోపిడీకి ఆలవాలం చేసాయి. దీనితో ప్రపంచ వ్యాప్తంగా అంతులేని దోపిడీకి తెరలేచింది.

ఈ నేపథ్యంలోనే నవంబర్, డిసెంబర్‌లలో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యు.టి.ఒ.) సమావేశాలు సియాటిల్‌లో జరిగాయి. నిరుద్యోగం, పేదరికం, వంటి ప్రపంచీకరణ ఫలితాలను చూసిన ప్రజానీకం తిరగబడ్డారు. డబ్ల్యు.టి.ఒ. సమావేశాలకు తీవ్ర ప్రతిఘటన ఎదురయ్యింది. సహస్రాబ్ది చివరి అంకం అలా ముగిసింది. సియాటల్ ప్రపంచ వ్యాప్తంగా పీడిత ప్రజల పోరాటాలకు, తిరుగుబాటుకు మారుపేర అయ్యింది. తరువాతి వంతు జినోవాది అయ్యింది. ఇక్కడ ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటం కొనసాగింది. జినోవాలో జరిగిన జి.8 దేశాల సమావేశాల సందర్భంగా లక్షలాది ప్రజలు నగరాన్ని చుట్టుముట్టారు. నిరసనలతాకిడికి తట్టుకోలేని పాలక వర్గపు దౌష్ట్యం పోలీసు కాల్పుల రూపంలో వెల్లడయ్యింది. ఒకరు మరణించారు. ఇక అనంతరం ప్రేగ్‌లో ఐ.ఎమ్.ఎఫ్., గోతెన్ బర్గ్‌లో యూరోపియన్ యూనియన్ నేతల సమావేశం, దోహాల వరుస పరంపర పోరాటాలు జరిగాయి. అర్జెంటీనా, అమెరికా దేశాలు, యూరప్, ఆసియా, దక్షిణాఫ్రికా దేశాలలో ఉద్యమాలు పోటెత్తాయి. ఇక మన దేశంలోని ఆంధ్రప్రదేశ్ విద్యుత్ ఉద్యమం, మహారాష్ట్రలో ఎన్‌రాన్ వ్యతిరేక పోరాటం, బాల్కో ప్రైవేటీకరణ వ్యతిరేక ఉద్యమాల మాట వేరే చెప్పనవసరం లేదు. ప్రపంచ వ్యాప్తంగా కార్మిక, కర్షక, విద్యార్థి, మహిళా, యువజన, మేధావి వర్గాలు పోరు బాటలోకి కదిలాయి.

ఈ నేపథ్యంలోనే ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా బ్రెజిల్‌లోని పోర్ట్ అలెగ్రేలో ప్రపంచ సామాజిక వేదిక జన్మనెత్తింది. నేటి ఆసియా సామాజిక వేదిక (హైదరాబాద్) నినాదం "మరో ప్రపంచం సాధ్యమే"ననేది అక్కడే రూపుదిద్దుకుంది. బ్రెజిల్‌లో జరిగిన ఈ ప్రపంచ సామాజిక వేదిక సమావేశాలు ఊహించని స్థాయిలో విజయవంతం అయ్యాయి. దీనితో అన్ని ఖండాల్లోనూ ప్రాంతీయ సామాజిక సదస్సులను జరపాలని తలపెట్టారు. భారతదేశంలో ఆసియా సామాజిక వేదికను మాత్రమే నిర్వహించాలని నిర్ణయించారు. భారత దేశంలో అయితే ప్రపంచీకరణ విధానాలకు నేడు మనదేశంలో ప్రయోగశాలగా మారిన హైదరాబాద్‌ను సామాజిక వేదిక భారత వర్కింగ్ కమిటి సమావేశాలకు సరైన ప్రదేశంగా నిర్ణయించింది. గత ఆరేళ్ళ నుండి ఆంధ్రప్రదేశ్‌పై ప్రపంచ బ్యాంకు నీలినీడలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. విస్తృతంగా ఉద్యమాలు నడుస్తున్న ఆంధ్రప్రదేశ్‌కు ఆసియా సామాజిక వేదికను నిర్వహించే అవకాశం లభించింది. వివిధ రాజకీయ భావాలు కలిగిన సంస్థలు, సంఘాలు పరస్పరం అభిప్రాయాలను మార్పిడి చేసుకునేందుకు, జనవరి 2వ తేదీనుండి 7వ తేదీ వరకు జరిగిన ఆసియా సామాజిక వేదిక అవకాశాన్ని కల్పించింది. మొత్తం 10,000 మంది ప్రతినిధులు పాల్గొంటారని నిర్వాహకులు భావించగా ఈ సంఖ్య 15 వేలు దాటిపోయింది. ఈ కార్యక్రమాలకు 10 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నట్లు ఆసియా సామాజిక వేదిక కన్వీనర్ ప్రబీర్ పుర్కాయస్థ తెలియచేశారు. వీటిలో 95 శాతం నిధులను దేశంలోని వివిధ సంస్థలు సమకూర్చాయని, ఫోర్డ్ సంస్థ 5శాతం నిధులను ఇచ్చిందని పుర్కాయస్థ చెప్పారు.

ఆసియా సామాజిక వేదిక సమావేశంలో గాంధేయవాదులు మొదలుకొని మార్క్సిస్టుల వరకు 300 సంఘాల ప్రతినిధులు పాల్గొన్నారు. ఇక విదేశీ ప్రతినిధులలో ఆస్ట్రేలియా, కెనడా, ఇటలీ, బ్రెజిల్, అర్జంటీనా వంటి ఆసియా వెలుపల దేశాలు ప్రతినిధులు కూడా ఉన్నారు. వీరంతా ప్రపంచీకరణకు, మతోన్మాదానికి వ్యతిరేకంగా తమ ఆలోచనలను పంచుకున్నారు. ఆధిపత్యం, దోపిడీ, వివక్షలేని "మరో ఆసియా"ను నిర్మించేందుకు గల ప్రత్యామ్నాయాలను చర్చించారు. ఈ సమావేశాలలో రోజుకు రెండు కాన్ఫరెన్సులు, 45 సెమినార్లు, 50 వర్క్‌షాపులు, ముఖ్యవ్యక్తుల ఉపన్యాసాలు, సాంస్కృతిక ప్రదర్శనలు, చలన చిత్ర ప్రదర్శనలు జరిగాయి. సుమారు 1000 మంది వాలంటీర్లు సేవలనందించారు. వీరిలో విదేశీయులు కూడా ఉన్నారు.

హైదరాబాద్‌లో జరిగిన ఆసియా సామాజిక సదస్సు వివిధ భాషలు, భిన్న వేషాలు, వర్ణాలు, స్త్రీలు, యువకులు, విద్యార్థులు, మేధావులు, పేద ప్రజల సమ్మేళనంగా జరిగింది. ఈ సమావేశం ఆరంభం సుమారు 200 డప్పుల మధ్య శ్రీశ్రీ రచించిన "మరో ప్రపంచం, మరో ప్రపంచం" గీతంతో జరిగింది. ఉదయం 9 గంటల నుంచి ఆరంభం అయిన సమావేశాలు, కార్యక్రమాలు రాత్రి పదిగంటల వరకు జరిగాయి. చివరిరోజైన 7వ తేదీన జరిగిన సమావేశంలో మాజీ రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ పాల్గొన్నారు. ఆయన ఇచ్చిన సందేశం సమావేశానికే ఒక హైలైట్.

ఈ సమావేశం ప్రధానంగా ఆరు థీమ్‌లలో జరిగింది. అవి. 1) శాంతి, భద్రత 2) రుణం, అభివృద్ధి, వాణిజ్యం 3) జాతీయరాజ్యం, ప్రజాస్వామ్యం, మినహాయింపులు 4) పర్యావరణం, సంస్కృతి, విజ్ఞానం 5) సామాజిక మౌలిక సదుపాయాలు, ప్రణాళికలు, సహకారం 6) సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు ప్రత్యామ్నాయాలు. ఈ వివిధ థీమ్ బృందాలకు కన్వీనర్‌లు, సభ్యులు ఉన్నారు. ప్రారంభ సమావేశంలో దేశంలో అమలు జరుగుతోన్న అడ్డు ఆపులేని ప్రైవేటీకరణను, పెచ్చరిల్లుతున్న మత మౌఢ్యాన్ని, అణచివేతను ఎండగడుతూ సుమారు 100 కళాకారులు గేయరూపకాన్ని ప్రదర్శించారు. సమావేశంలో అర్జంటీనా మదర్స్ మే ఆఫ్ ప్లాజా నాయకురాలు నోరాడి కార్టినస్ ప్రారంభోపన్యాసం చేసారు. అర్జంటీనాలో నయావలస వాదానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో తనకుమారునితో సహా 30 వేల మంది పిల్లలు అదృశ్యమయ్యారని ఆమె ఈ సందర్భంగా చెప్పారు. అయితే, తాను కేవలం వారి తరపునే మాట్లాడడంలేదని, ప్రపంచంలోని అన్ని దేశాలలోను సామ్రాజ్యవాద దుష్ట పన్నాగాలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో అదృశ్యం అయిపోయిన వారందరి తరఫునా మాట్లాడుతున్నాననీ ఆమె అన్నారు. ఆ పిల్లలు దేనికోసమై పోరాడారో తల్లులుగా ఆ పోరాటాన్ని తుదకంటా కొనసాగించాలని కార్టినస్ పిలుపునిచ్చారు. ప్రపంచంలోని అసమానతలను ఆమె నిలదీశారు. దీనికి కారణం సామ్రాజ్యవాదులేనని పేర్కొన్నారు. ఉదారవాద ఆర్థిక విధానాలు, సామ్రాజ్యవాదుల కుతంత్రాలకు వ్యతిరేకంగా పోరాడాలని ఆమె పిలుపునిచ్చారు.

వేదిక ప్రారంభసభలో మరో వక్త నర్మదా బచావో ఆందోళన నేత - మేథాపాట్కర్ ప్రజలు ఐక్య పోరాటాలతో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని నిర్మించాలని పిలుపునిచ్చారు. మతోన్మాదాన్ని అహింసాయుత పద్ధతుల్లో ఓడించాలని పేర్కొన్నారు. ప్రపంచీకరణను వ్యతిరేకించే సందర్భంలో అంతర్జాతీయతను విడనాడరాదని పాట్కర్ వివరించారు. సదస్సులతోపాటు కార్యాచరణకు కూడా దిగాలని ఆమె అన్నారు. ప్రపంచీకరణను వ్యతిరేకించేవారు బ్రెజిల్ రైతాంగ పోరాటాలను, నేపాల్ తరహా నిరంకుశ వ్యతిరేక పోరాటాలను, ప్రపంచ వాణిజ్య సంస్థ వ్యతిరేక పోరాటాలను ఐక్యం చేయాలని కోరారు. చంద్రబాబునాయుడు అనుసరిస్తోన్న సరళీకరణ విధానాలను ఆమె తీవ్రంగా విమర్శించారు.

జనవరి 4వ తేదీన సమావేశాల సందర్భంగా రుణం, వాణిజ్యం, అభివృద్ధి అన్న అంశంపై సదస్సు జరిగింది. దీనిలో వాల్డెన్‌బెల్లో, సి.పి. చంద్రశేఖర్, లిడీ నాక్‌పిల్, ఉత్సపట్నాయక్, ఎస్.పి. శుక్లా తదితరులు ప్రసంగించారు. నేటి యుగంలో వర్ధమాన దేశాల రుణాల భారం తుదకు నయావలస వాదానికి మరో మార్గంగా మారిందని బెల్లో అన్నారు. ఫిలిప్పైన్స్‌కు చెందిన లిడీ నాక్‌పిల్, ఆగ్నేయ ఆసియాతో పాటుగా వర్ధమాన దేశాల్లో పెరిగిన రుణభారం, వాటి పాలకవర్గాల్లో వచ్చిన మార్పులను సవివరంగా విశ్లేషించారు. ఫిలిప్పైన్స్, థాయ్‌లాండ్, ఇండోనేషియా దేశాల ప్రతినిధులు అంతర్జాతీయ రుణ దాతలతో తమ చేదు అనుభవాలను, తమ పోరాటాలను వివరించారు. ఈ సదస్సులో గాట్‌లో భారత రాయబారి ఎస్.పి.శుక్లా ప్రపంచ వాణిజ్య సంస్థను ప్రజా తంత్రీకరించ వలసిన అవసరాన్ని వక్కాణించారు. ప్రపంచ వాణిజ్య సంస్థ షరతులు వివిధ దేశాల స్వారభౌమాధికారానికి ముప్పుగా మారాయని విమర్శించారు. జనవరి 4వ తేదీనే వేదిక సందర్భంగా అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం ఆధ్వర్యంలో సదస్సు జరిగింది. దేశంలోని వ్యవసాయ కార్మికుల సమస్యలపై ప్రభుత్వం ప్రతిస్పందించాలని, లేని పక్షంలో ఉద్యమాలు తప్పవని హెచ్చరించింది. నేడు మన దేశంలో 15 కోట్ల మంది వ్యవసాయ కార్మికులు వున్నారని, సంఘం అఖిల భారత ప్రధాన కార్యదర్శి సునీల్ చోప్రా వివరించారు. 1991-2001 సంస్కరణల కాలంలో దేశంలో అదనంగా 2 కోట్ల మంది వ్యవసాయ కార్మికులు వచ్చి చేరారని ఆయన తన ప్రసంగ పత్రంలో పేర్కొన్నారు. 1991లో వ్యవసాయ కార్మికుని ధాన్యం వినియోగం 174 కిలోలుగా వుందనీ, ఇది 2001 నాటికి 154 కిలోలకు పడిపోయిందనీ వివరించారు. మరోవక్త తన ప్రసంగంలో, ఆంధ్రప్రదేశ్‌లో 2001 నాటికి కోటీ ఎనిమిది లక్షలుగా వున్న కార్మికుల సంఖ్య నేడు కోటీ ముప్పయి లక్షలకు పైబడి పెరిగిందన్నారు. ఒకవైపు పేరుకుపోతోన్న ఆహార నిల్వలను, మరోవైపు ఆకలి బావులను సదస్సు గుర్తుచేసింది.

పాలస్తీనాకు చెందిన రైతు షరీఫ్ మహ్మద్ ఒమర్ ఖలీద్, "మాదేశంలో ప్రశ్నించే అధికారం లేదు. అలా ప్రశ్నిస్తే ఉగ్రవాద ముద్రను వేస్తున్నారు..." అని ఆవేదన వెలిబుచ్చారు. తమిళనాడుకు చెందిన దళితుల ప్రతినిధి ఆదప్పన్ తమిళనాడులో వివిధ కంపెనీలకు 20 లక్షల హెక్టార్ల భూమిని తమ రాష్ట్ర ప్రభుత్వం లీజుకు ఇచ్చిందని తెలిపారు. వీటిలో పెక్కు దళితుల భూములు కూడా వున్నాయన్నారు.

శాంతి, భద్రతలపై జరిగిన సదస్సులో ఉపఖండంలోని పాలకవర్గాలు తమ అస్తిత్వానికే ముప్పు వస్తుండడంతో, నిరంతర ఉద్రిక్తతల ద్వారా తమ పబ్బం గడుపుకుంటున్నారని పాకిస్తాన్ పీస్ ఇనిషియేటివ్ ప్రతినిధి నిఘాత్ జాన్ పేర్కొన్నారు. శాంతి, భద్రతలు కూడా వర్గ ప్రయోజనాలకు లోబడే వుంటాయని ఆమె వివరించారు. అమెరికాకు చెందిన గ్రీన్‌పీస్ సంస్థ నాయకుడు టామ్ క్లెమెంట్స్ అమెరికా సాగిస్తోన్న రాజకీయ ఏకఛ్ఛత్రాధిపత్యాన్ని విమర్శించారు. ఆచరణలో అమెరికా రోజు రోజుకూ నిరంకుశంగా తయారవుతుందని చెప్పారు. అమెరికా సంవత్సరానికి 450 అణ్వాయుధాలు నిర్మించగల సామర్థ్యాన్ని కలిగి వుందని అన్నారు. నేడు ఇరాక్, ఉత్తర కొరియాలపై అణ్వాయుధాలు వున్నాయనే నెపంతో అమెరికా ఆంక్షలు విధించడం, యుద్ధానికి పూనుకోవడం హాస్యాస్పదమని అన్నారు. రష్యా పతనానంతరం అమెరికా దురాగతాలకు అడ్డు అపులేకుండా పోయిందని విచారం వ్యక్తం చేసారు. అమెరికా సైనిక ప్రభావం నుండి బయట పడేంతవరకూ ఆసియాలో శాంతి వుండదని ఫిలిప్పైన్స్‌కు చెందిన చందన్ ముజఫర్ అన్నారు. ఈ సమావేశంలో మాజీ నౌకాదళ ప్రధానాధికారి అడ్మిరల్ రాందాస్ మాట్లాడుతూ, భారత రక్షణ వ్యయం పెరిగిపోతోందన్నారు. ఈ వ్యయంతో భారత ప్రభుత్వం ప్రజలను కాపాడుతున్నదా, సరిహద్దులను కాపాడుతున్నదా లేదా తనను తాను కాపాడుకుంటున్నదా అన్న విషయాన్ని ప్రజలు ఆలోచించాలని కోరారు. దీనికి అంతటికీ కారణం అయిన ఆర్థిక విధానాలు మారాలని పిలుపునిచ్చారు.

ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాలు, శాంతి ఉద్యమాలు ఒకటి కావాలని వక్తలు పిలుపునిచ్చారు. ఆసియా సామాజిక వేదిక దీనికి ఆరంభం కావాలని అన్నారు. సభకు ప్రపంచీకరణ వ్యతిరేక మేధావి వాల్డెన్ బెల్లో ఆహ్వానంపలికారు. అణు నిరాయుధీకరణ, శాంతి ఉద్యమనేత అచిన్‌వనాయక్ వందన సమర్పణ చేసారు.

ఆసియా సామాజిక వేదిక సమావేశాలలో కాశ్మీర్ బాలుడు షబీర్ కరమ్ దయార్ద్ర గాథ, ఆఫ్ఘన్ వితంతువు దీనా పర్వాబ్‌ది దీనగాథ, అహ్మదాబాద్‌కు చెందిన మత కల్లోల బాధితురాలు వహదాబాను జీవితానుభవం ప్రతినిధులకు తెలిసాయి. దీనితో కాశ్మీర్ వేర్పాటువాదం తాలూకు ప్రతిబింబం, తాలిబన్ ముష్కరుల కసాయిపాలన, గుజరాత్‌లో హిందూ మతోన్మాద "తాలిబన్"ల నిజరూపం మరింతగా ప్రస్ఫుటం అయ్యాయి. సమావేశంలో ఫ్లోరోసిస్ పీడిత గ్రామ ప్రజలు తమ గళం విప్పారు. వారు కృష్ణానదీ జలాలను ఫ్లోరోసిస్ బారిన పడుతున్న గ్రామాలకు తరలించాలని డిమాండ్ చేస్తూ 150 కిలోమీటర్ల పాదయాత్ర చసి హైదరాబాద్‌లోని సామాజిక వేదిక ప్రాంగణం నిజాం కళాసాల వరకూ సాగించారు. ఈ సందర్భంగా పాదయాత్ర 66 గ్రామాల ద్వారా సాగింది.

ఈ సమావేశాల సందర్భంలో మాట్లాడిన ప్రముఖ ఆర్థికవేత్త సమీర్ అమీన్ అమెరికా తన ఆర్థికవ్యవస్థను కాపాడుకునేందుకు ప్రారంభించిన యుద్ధజ్వాల భారత్‌కు విస్తరించకముందే మూడవ ప్రపంచదేశాలు కళ్ళు తెరవాలని హెచ్చరించారు. అమెరికా తన యుద్ధవ్యూహంలో భారత్‌తో పాటు చైనాను కూడా లక్ష్యంగా కలిగి ఉన్నదని చెప్పారు. ఇతర దేశాలను రోగ్ దేశాలని పిలుస్తున్న అమెరికా స్వయంగా పెద్ద రోగ్ దేశమని (దుష్టరాజ్యం) అని ఆయన అన్నారు. గతంలో ఆర్థిక సంక్షోభాల కాలంలో సామ్రాజ్యవాద దేశాల మధ్య అంతర్గత వైరుధ్యాలు తలెత్తేవి. అయితే నేడు అమెరికా, జపాన్, యూరోపియన్ యూనియన్లు మూడింటిని వ్యతిరేకించి పోరాడవలసిన కర్తవ్యం ప్రపంచీకరణ వ్యతిరేక పోరాట శక్తులపై ఉన్నదని సమీర్ అమీన్ పేర్కొన్నారు. అమెరికాకు వ్యతిరేకంగా రష్యా-చైనా-భారత్‌లు ఒక కూటమిగా ఏర్పడాలని ఆయన అభిప్రాయపడ్డారు.

సామాజిక వేదిక సదస్సుల సందర్భంగా మరోభారతం సాధ్యమేనని ఆర్థికవేత్త ప్రభాత్ పట్నాయక్ పేర్కొన్నారు. 1990వ సంవత్సరం తరువాత పేదరికం పెరిగిందని, నిరుద్యోగసేన రెట్టింపయ్యిందని ఆయన వివరించారు. దేశంలోని రాష్ట్ర ప్రభుత్వాలతో ప్రత్యక్ష సంబంధాలు ఏర్పరుచుకోవడం ద్వారా రుణాలను సామ్రాజ్యవాద ఆర్థిక సంస్థలు ఇస్తున్నాయని పేర్కొన్నారు. ఈ విధంగా రాష్ట్రాలకు ప్రత్యక్షంగా నిధులు సమకూర్చే చర్యలు దేశ సమైక్యత, సమగ్రతకు ముప్పు అని వివరించారు. ఈ స్థితిలో ప్రత్యామ్నాయ విధానాలు అమలు చేసే మరో భారతం తక్షణ అవసరం అని అన్నారు. దేశంలోని సంపన్న వర్గంపై ప్రత్యక్ష పన్నులు విధించాలని ఆయన సూచించారు. తద్వారా ఏటా 30 వేల కోట్ల రూపాయల అదనపు ఆదాయం లభించగలదని,. ఇదే జరిగితే అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకులను ఆశ్రయించనవసరం లేదని వివరించారు.

ఇంకా ఈ సమావేశాల సందర్భంగా అర్జెంటీనాలో పరిస్థితి కూడా చర్చనీయాంశం అయ్యింది. ఒకప్పటి ఆర్థిక పటిష్టత గల అర్జెంటీనా సంస్కరణల తరువాత, దేశ జనాభాలోని మూడున్నర కోట్ల మందిలో సగభాగానికి పైగా ఆహారం, వసతులు లేని స్థితిలో వున్నారు. ఆర్థిక పెత్తందారీతనం శృతిమించి రాగాన పడుతున్నది. ఆత్మహత్యలు పెరిగిపోయాయి. ఉద్యమ పోరాటాలు ఉవ్వెత్తున ఎగసిపడుతున్నాయి. లాటిన్ అమెరికాలోని ఉరుగ్వే, పెరూ, చిలీలలో కూడా ఇదే పరిస్థితి ఎదురవుతోంది. బొలీవియా దేశపు మంచినీటి వ్యతిరేకపోరాటం అందరినీ ఆకట్టుకున్నది. ఆఫ్రికా ఖండం కూడా పోరాటాలలో రాటు తేలుతున్నది. జాంబియా ఉదాహరణ ప్రధానంగా ముందుకు వచ్చింది.

నిజాం కాలేజ గ్రౌండ్స్‌లో జరిగిన ముగింపు సమావేశంలో మాజీ రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ పాల్గొన్నారు. నోబెల్ శాంతి బహుమతి విజేత, బర్మాలో ప్రజాస్వామ్యం కోసం పోరాటం చేస్తోన్న అంగ్‌సాన్‌సూచీ టెలిఫోన్ ద్వారా సందేశాన్ని పంపారు. "మరో ఆసియా సాధ్యమేకాదు, మరో ఆసియాను సృష్టించాలి" అని ఆమె సందేశంతో కార్యాచరణను నొక్కిచెప్పటం గమనార్హం.

## నిరసన గళాలు

ఈ సమావేశం సందర్భంగా కొన్ని నిరసన గళాలు వినిపించాయి. ఇది ప్రజా ఉద్యమాలను, ఎదగనీయకుండా చేసి ప్రతిఘటనను బలహీన పరుస్తుందని విమర్శకుల అభిప్రాయం. పాత రోజుల్లో మతసంస్థలు ప్రజల అసంతృప్తిని అదుపులో పెట్టేవి. ఈమధ్య కొత్త సాంఘిక సంస్థలు పుట్టుకొచ్చాయి. మత సంస్థలు చేసిన పనులను ఇపుడీ సంస్థలు చేస్తున్నాయి. ఆ సంస్థలే ప్రభుత్వేతర సంస్థలు (నాన్-గవర్నమెంట్ ఆర్గనైజేషన్స్ లేదా ఎన్‌జివోలు). వీటికి అపారమైన నిధులను అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు, యూరోప్, అమెరికా, జపాన్ దేశాల ప్రభుత్వ సంస్థలూ, స్థానిక ప్రభుత్వాలూ ఇస్తుంటాయి. అలా ఏటా వస్తున్న నిధులు పది బిలియన్ డాలర్లు. 'ప్రపంచ సోషల్ ఫోరం సమావేశాల్లో వారు ప్రధాన పాత్ర వహించటం ఆక్షేపణీయం' అని సి.పి.ఐ. రాష్ట్రకార్యదర్శి సురవరం సుధాకర రెడ్డి అంటున్నారు. "ఈ వేదికలో రాజకీయ పార్టీలు పాల్గొనరాదని నిషేధించటం వేదిక కార్యాచరణను ప్రతిపాదించకుండా చర్చలకు పరిమితం చేయటం అభ్యంతరకరం. ఈ పోరాటాన్ని రాజకీయ రహితం చేయచూడడం దానిని నిర్వీర్యం చేయడమే. కార్యాచరణ లేకుండా చేయటంతో ఇది కేవలం చర్చావేదికగా పరిమితమవుతోంది. ఈ మేరకు విమర్శలు న్యాయబద్ధమైనా మేము దానిని అంగీకరిస్తూనే దీనిలో పాల్గొనాలని నిర్ణయించుకున్నాం" అని ఆయన అంటూ "ఇది పోరాటాల వేదికకాదు" అని స్పష్టం చేశారు. అయినా "ఈ ఫోరం సభలు ఇక్కడ జరగటం, రాష్ట్రవ్యాపితంగా ప్రపంచ బాంకు వ్యతిరేక పోరాటాలకు చైతన్యానికి మరింత పదును పెడుతుంది" అని ఆయన అభిప్రాయపడ్డారు. (హైదరాబాద్ సమావేశం జరిగినపుడు విప్లవ మేధావుల స్పందన గురించి సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూడెమోకసీ అభిప్రాయం ఆసక్తికరంగా వుంది. "దశాబ్దాలతరబడి ఆటుపోట్లను భరించి నిలబడిన అసంఖ్యాక విప్లవ మేధావులు కేవలం రెండు సంవత్సరాల కాలంలోనే ప్రపంచ వేదికకు దగ్గరవుతున్నారు. ఈనాటికి దాదాపు వీరందరూ ఎటువంటి ప్రలోభాలు, ఎరలూ, పదవీ వ్యామోహాలు, ఇగోయిజాలకు చోటు యివ్వనివారే. ప్రపంచ వేదికలలో కూడా విప్లవ లక్ష్యంతో పనిచేయవచ్చని నిజాయితీగా విశ్వసిస్తున్న వారు కూడా వున్నారు.... వీరిలో ఎక్కువ మంది ఈ నాటికీ మానసికంగా ప్రపంచ సంస్థ నిజ లక్ష్యాలకు ప్రతినిధులుకాదు. మానసికంగా, తాత్వికంగా వీరు విప్లవ పక్షీయులే. అదే సమయంలో ప్రపంచ వేదిక ద్వారా వీరు చేబట్టబోయే కృషి కనీస ఫలితాలు కూడా ఇవ్వదు. వారి కృషి చొరవ, సామర్థ్యాలన్ని ఆచరణలో ప్రపంచ వేదికకే ప్రధానంగా లాభిస్తాయి. వీరిలో ఎక్కువశాతం మంది ముమ్ముందు ప్రపంచ వేదికలో ఇమడలేక, దాని నిజస్వరూపాన్ని గ్రహించి తమ నిజస్థానాలకు తిరిగి రావచ్చు అయితే ఈలోగా వారి "ముఖ విలువలు", "ప్రజాకర్షణ శక్తి", ప్రభావిత సామర్థ్యాలూ ప్రపంచ వేదిక బలపడడానికి శక్తివంతంగా ఉపయోగపడతాయి. అందుకే ఈ పరిణామం విప్లవ శక్తులకు విషాదాన్ని కలిగిస్తుంది.

ఆసియా సామాజిక వేదికను ఇలా అనుమానించడానికి కారణాలేమిటి? ఫేగ్ (ఫోరమ్ ఎగనెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్) సంస్థ అధ్యక్షులు వేములపల్లి వెంకట్రామయ్య ఈ ప్రశ్నకు జవాబిస్తూ "వేదిక 2002 సమావేశంలో ప్రపంచీకరణను మౌలికంగా వ్యతిరేకించేవారినుండి ఏదో కొద్ది పాటి మాటల తేడాతో బలపరిచేవారు మాత్రమేగాక, అంతర్జాతీయంగా దీనిని అమలు చేయటంలో మూల స్థంభాలుగా వున్న ప్రపంచ బాంకు ప్రతినిధులు కూడా వున్నారు. ఈ వాస్తవాన్ని భోపాల్ ప్రకటన కూడా అంగీకరించింది. ఇప్పటికే ఈ వేదికలో డబ్ల్యు.టి.వో., బ్రెటన్‌వుడ్ సంస్థలను సంస్కరించడం సాధ్యమని నమ్మేవాళ్లు, అది అసాధ్యమన్న అభిప్రాయాలున్నవారు, ఈ సంస్థల్లో అతి మౌలికమైన, క్రమానుగతమార్పులు అవసరం అనుకునేవాళ్లు, ఇందుకు భిన్నంగా పోరాటాలే సరైన మార్గమని అనుకొనేవాళ్లు, ఇలా అన్ని రకాల వారూ వున్నారు. వేదికను ఆర్గనైజ్ చేసిన వారిలో సంస్కరణవాదులది ప్రధానపాత్ర. ఇందులో ఫ్రెంచి సోషలిస్టులు, ప్రపంచ బాంకు, ఐక్యరాజ్య సమితి ప్రతినిధులు, బెల్జియం వర్కర్స్ పార్టీలో మితవాదులు, సోషల్ డెమాక్రట్లు వున్నారు... బహుళజాతి సంస్థల నుండి సామ్రాజ్యవాద దేశాలనుండి పెద్ద ఎత్తున నిదులు పొందుతున్న స్వచ్ఛంద సంస్థలు కూడా గణనీయమైన సంఖ్యలో వున్నాయి. ప్రపంచ బాంకు ప్రతినిధులూ, సామ్రాజ్యవాదం మోచేతి నీళ్లు తాగుతున్న ఎన్జీవోలు ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఏ మరో ప్రపంచాన్ని గురించి ఆలోచిస్తారు, చర్చిస్తారు, కృషి చేస్తారు? డబ్ల్యు.టి.వో.ను, బ్రెటన్‌వుడ్ సంస్థలను సంస్కరించడం సాధ్యమని నమ్మేవాళ్లతో ప్రపంచీకరణకు వ్యతిరేకంగా మరో ప్రపంచం కోసం కృషి చేస్తారు! కాని అదే సమయంలో ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఆచరణలో పోరాడుతున్న రాజకీయ పార్టీలు మాత్రం నిషిద్ధం. ఇది ప్రపంచ సామాజిక వేదిక నిజస్వరూపాన్ని తెలియచేస్తున్నది."

□

# అంతంలేని అనావృష్టిలో అనంతరైతాంగం

- వి.హనుమంతరావు

రాష్ట్రంలో ఆత్మహత్యలే ఒక ఉద్యమంగా కొనసాగుతున్న పరిస్థితులను కల్పించిన ఘనత రాష్ట్ర ప్రభుత్వానికే దక్కుతుంది. అనేక విషయాల్లో కమిటీలు, కమీషన్లను నియమించే ప్రభుత్వానికి ఆత్మహత్యలు ఎందుకు జరుగుతున్నాయి, వీటి నివారణకు ఏం చెయ్యాలి అని పరిశీలించే కమీషన్ నియమించాలనే ఆలోచన రాలేదంటే వీటిపట్ల ఎంత నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారో విదితమవుతుంది.

అన్ని జిల్లాల్లో ఆత్మహత్యలు ఒక ఎత్తు అయితే, అనంతపురం జిల్లాలో ఆత్మహత్యలను ప్రత్యేక దృష్టితో పరిశీలించాలి. ఆ జిల్లాలో ప్రచురించే "కదలిక" మాసపత్రిక నవంబరు సంచికను "అనంత వ్యవసాయ సంక్షోభం" ఒక ప్రత్యేక సంచికను విడుదలచేశారు. ఆత్మహత్యల నుంచి ఆత్మస్థైర్యం వరకూ, బ్రిటిష్ పాలన నాటి నుంచి నేటి వరకూ ఆ జిల్లా పరిస్థితులను లోతుగా అధ్యయనం చేసిన వైనం అందులో ప్రచురించిన వ్యాసాల్లో కనపడుతుంది. "నూరేళ్లు బతకాల్సిన వారు తమపేగు బంధాన్ని, అప్పుల్ని వదలుకొని బలవన్మరణం పొందుతున్నారంటే వారిని ఈ విపరీత చర్యలకు పాల్పడేటట్లు చేసిన సామాజిక పరిస్థితుల్ని మనం సీరియస్‌గా అధ్యయనం చేయాలి". "2000 సంవత్సరం సెప్టెంబరు 15న అనంతపురం మండలం చియ్యేడు గ్రామంలో బండి నరసింహులు అనే రైతుతో ప్రారంభమైన ఆత్మహత్యల పరంపర మే 11, 2002న కదిరి మండలంలోని కె.బత్తలపల్లి గ్రామానికి చెందిన నారాయణస్వామి అనే రైతు యువకుని దాకా 174 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకొన్నట్లు వార్తాపత్రికలు తెలుపుతున్నాయి". ఆత్మహత్యలు చేసుకున్నవారి వివరాల్ని పరిశీలిస్తే, వారు వారి వారి గ్రామాల్లో మంచి వ్యక్తులుగా పేరు తెచ్చుకున్నవారే. వ్యక్తిగా వ్యసనాలున్న వారుకాదు (ఏ పదిమంది మాత్రమో తప్ప). 75 శాతం మందికి నేరుగా వ్యవసాయంలో పెట్టుబడి కోసం చేసిన అప్పులు ఆత్మహత్యలకు కారణమైతే, 25శాతం మందికి ఆడపిల్లల పెళ్ళిళ్లువల్ల పెరిగిన అప్పులతో పాటు వ్యవసాయంలో పెట్టుబడుల కొరకు చేసిన అప్పులుకూడా కారణమయ్యాయి. ఆ జిల్లాలో జరిగిన ప్రతినాలుగు ఆత్మహత్యల్లో ఒకటి వ్యవసాయ రుణాలవల్లనే జరిగింది. వ్యవసాయంలో సంక్షోభానికి ఈ ఆత్మహత్యలు అద్దం పడుతున్నాయి.

రాష్ట్రంలో ఉభయగోదావరి జిల్లాలంత విస్తీర్ణంకల జిల్లా అనంతపురం. ఆ జిల్లాలతోపోలిస్తే, జన సాంద్రత తక్కువ. అభివృద్ధి, ఉపాధిలేని కారణంగా, ఈ జిల్లాలకు వలస వచ్చి ఎవరూ స్థిరపడరు. పైగా ఈ జిల్లా ప్రజలు, ఇతర జిల్లాలకు వెళ్ళి స్థిరపడ్డారు. భూమే ప్రధాన జీవనాధారం కాబట్టి వర్షాలు పడినా పడకపోయినా, అప్పో, సప్పోచేసి వ్యవసాయం మీదే ఆధారపడాల్సి రావటంతో అప్పుల భారం పెరగడానికి పునాది ఏర్పడింది. 80వ దశకంలో వేరుశనగకు మంచి రేటు పలకటంతో, జిల్లాలో వేరుశనగ పంటే ప్రధాన పంటగా తయారైంది. 75-76లో ఎనిమిది లక్షల ఎకరాలు సాగవుతున్న వేరుశనగ 00-01 నాటికి 19 లక్షలకు పెరిగింది. ఫలితంగా ఆహార ధాన్యాల పంట విస్తీర్ణం 14 లక్షల నుంచి 2.32ల.కు తగ్గిపోయింది. ఇది రెండు పరిణామాలకు దారితీసింది. వేరుశనగలాంటి పంటకు అధిక ఎరువు వాడడం, తిండిగింజలు బజారులో కొనుక్కోవాల్సి రావటం. ఆర్థికభారం పెరిగింది. వ్యవసాయ ఖర్చులూ పెరిగాయి. 1990 నాటికి ఒక ఎకరానికి విత్తనం, ఎరువులు, మందులపై పెట్టుబడులు రూ. 1200 వరకూ వుంటే 2001 నాటికి ఆ మొత్తం రూ.2000 దాటింది. పంట ధరలు పెరగలేదు. 96-97లో క్వింటాకు రు.1500లు వున్నధర, ఇప్పటికి రు.1300 కు పడిపోయింది. జిల్లాలో పనిచేస్తున్న 170 వేరుశనగ మిల్లుల్లో 50 వరకూ పడిపోయాయి. కరెంటు బిల్లులు చెల్లించని కారణంగా 21000 వ్యవసాయ విద్యుత్ కనెక్షన్లను ట్రాన్స్కో తొలగించింది. నీరువున్నా, కరెంటు లేదు.

మంచిధర పలికినంతకాలం సామాజిక మార్పులు (ఆర్భాటంగా పెళ్లిళ్లు, కట్నాలు వగైరా) వారి జీవిత విధానాలను ప్రభావితం చేశాయి. "ఒకపుడు పది ఎకరాల ఆసామికి 10 వేలు అప్పుంటే గొప్ప. ఇప్పుడు ఒక లక్షనుండి ఐదు లక్షల వరకూ అప్పులు చేయగలుగుతున్నాడు." కాని వర్షాలు పడక, చేసిన అప్పులు తీర్చలేక రుణగ్రస్తుడవుతున్నాడు. "ఈనాడు జిల్లాలో ఎకరా నుండి 2000 ఎకరాలు గలిగిన రైతు వరకూ అప్పువుంది. కుటుంబంలో ఆడపిల్ల పెళ్లికి చేసిన అప్పు తీర్చడానికి 10 సంవత్సరాల సమయం పడుతోంది. గత 3-4 సంవత్సరాలు పంటలు పండక, అప్పులకు వడ్డీలు కూడా చెల్లించలేని పరిస్థితుల్లో ప్రయివేటు రుణదాతలు, బాంకులు, సొసైటీలు వొత్తిడి చేయటం మూలానే రైతులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు". "గతంలో కరువులు సంభవించినపుడు అప్పులు పెద్దగా వుండేవి కావు. అందుకే ఎంతో

ఘోరమైన కరువులు వచ్చినా ఆకలితో మరణించటం తప్ప బలవన్మరణాలుండేవి కావు. మాన సామాజిక విలువలతో కేవలం 25 వేల రూపాయల కాంట్రాక్టుకోసం ఆత్మీయులే, నెమళ్లపల్లిలో పసి పిల్లలతో సహా ఒకే కుటుంబంలో ఏడు మందిని చంపిన సంఘటన ఒక కిరాతకంకాగా, స్టార్ డీలర్‌షిప్‌కోసం స్వంతసోదరుడే అన్నను చంపిన ఘటన రాప్తాడు మండలంలో జరిగింది. ఆత్మీయత, మానవ సంబంధాల రాసి క్రమేణా తగ్గిపోతున్నది". "ఇపుడు మరో ప్రమాద ఘంటిక మోగనుంది. కేంద్రం అనుమతి కారణంగానే దేశంలో ఇబ్బడి ముబ్బడిగా దిగుమతి అవుతున్న పామొలిన్ నూనె కారణంగా ఒకవేళ పంట పండినా రైతు ఉత్పత్తులుకొనే వాడుండడు. ప్రకృతి ఒక రకంగా దగా చేస్తుంటే ప్రభుత్వాలు మరో రకంగా దగా చేస్తున్నాయి."

"ఏక పంట విధానం, పంటకు చీడపురుగుల దాడి, ప్రపంచ వాణిజ్య సంస్థతో చేసుకున్న ఎగుమతి, దిగుమతుల ఒప్పందంతో పామొలిన్ దిగుమతి వేరుశనగ రైతులపై తీవ్ర ప్రభావం చూపింది."

42 వేల కోట్లమేరకు ప్రపంచ బ్యాంకు నుంచి అప్పు తెచ్చిన ముఖ్యమంత్రి అనంత రైతులకోసం అందులో కనీస, ఒక్క రూపాయైనా విదిలించారా అని, జిల్లాలోని రచయితలూ, కవులూ, కళాకారులూ, మేధావులూ ఒక ప్రకటనలో ప్రశ్నించారు. ప్రశ్నించడమే కాకుండా "మనం పోరాడాల్సింది మన ప్రాణాలతో కాదు. మన ప్రాణాలను హరిస్తున్న పాలక పక్ష దుష్ట విధానాలతో, రైతువ్యతిరేక ప్రభుత్వ నిరంకుశ వైఖరితో, రైతుపీడిత అధికార యంత్రాంగంతో" అంటూ ఆత్మహత్యలకు పాల్పడవద్దని, అలుబిడ్డలున్నారని మరచిపోవద్దని రైతులకు ఆత్మవిశ్వాసాన్ని కల్గించటానికి యాత్ర జరిపారు. కార్పోరెట్ సంస్థలు దేశంలో లక్షా పాతికవేల కోట్ల రూపాయలను బాంకులకు చెల్లించకుండా మొండిబకాయిలుగా తయారైనా సుతిమెత్తగా వారిని చెల్లించండి బాబూ అని బతిమాలుతున్న ప్రభుత్వం జిల్లాలో మహా అయితే రు.2500 కోట్ల రుణాలను గోళ్లూడగొట్టి వసూలుచేస్తున్న ప్రభుత్వాన్ని ఏమనాలి?

ప్రముఖ ఇంగ్లీషు దిన పత్రిక స్టేట్స్‌మన్‌లో సంపాదక బాధ్యతలు నిర్వహించి, ప్రస్తుతం కోల్‌కటాలో ఒక స్వతంత్ర వార్తా సంస్థను నడుపుతున్న అతిథిరాయ్ ఘటక్ రెండు దినాలపాటు కరువు జిల్లాలో పర్యటించినపుడు 'ఈనాడు' అనంతపురం జిల్లా సప్లిమెంటులో బాంకులు ఇచ్చిన అడ్వర్టయిజ్‌మెంట్లను పరిశీలించారు. స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా, సిండికేట్ బాంకు, అనంత గ్రామీణ బాంకు, ఇండియన్ ఓవరసీస్ బాంకుల్లో రైతులు తమ ఆభరణాలను కుదువపెట్టి, తీసుకున్న రుణాలు తిరిగి చెల్లించలేనందుకు, వారు కుదువపెట్టిన వస్తువుల వేలం ప్రకటనలు ఈ పత్రికలో సర్వసాధారణం. ఒకోసారి రైతులు ఇవ్వతేలిన రుణం రు.2500 నుంచి రు.12000 మాత్రమే. ఒక రైతు విషయంతో అతను తీర్చాల్సిన రుణం కేవలం రు.316 లు. విశేషమేమంటే చాలామంది అసలు చెల్లించరు. వడ్డీలే వారిని కృంగదీస్తున్నాయి. ధర పడిపోవడంతో వారు రుణం చెల్లించలేక పోయారు. లక్షకోట్లు బాకీ పడ్డ కార్పోరేట్ సంస్థలను ఏమీ చేయరు. మార్చినెలలో కేవలం రెండు రోజుల్లో 132 మంది రైతుల పేర్లు ఈ ఎడ్వర్టయిజ్‌మెంట్లలో ప్రచురించబడ్డాయి. కొంతమంది తమ భూమినే ఈ వేలంపాటల్లో కోల్పోయారు. చియ్యేడు గ్రామంలో ఇద్దరు అన్నతమ్ములు 10 ఎకరాల భూమిని కోల్పోయారు. వీరిద్దరూ చెల్లించాల్సిన రుణం రు.20000. వేలంపాటలో వచ్చిన డబ్బు రు.25 వేలు. మిగతా డబ్బు ఏమైందో తెలియదు. ఇవన్ని బాంకుల రుణాల లెక్కలు. వడ్డీ వ్యాపారుల నుంచి ఎంత రుణం తీసుకున్నారో లెక్కలేదు. ఆమె గమనించిన మరో విషయమేమంటే 1997-2000 మధ్య కాలంలో 1826 మంది ఆత్మహత్యలు చేసుకొంటే, అందులో 1061 మంది, అంటే 58శాతం "భరించలేని కడుపునొప్పి"తో మరణించారట. చంద్రబాబుపాలనలో ఒకే జిల్లాలో ఇంతమందికి ఒకే రకం వ్యాధి అదీ "కడుపునొప్పి" రావటం, చనిపోవటం విడ్డూరం. ఈ కడుపునొప్పి వెనకనున్న అసలు కారణమేదో స్పష్టం.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పరిపాలించినపుడు కరువు కాటకాలు వస్తే కమీషన్లను నియమించటం జరిగింది. 1875లో, 1880లో, 1901లో కమీషన్లు ఏర్పాటు చేసినట్లు చరిత్ర చెబుతోంది. 1901 ఫామిన్ కమీషన్ తన నివేదికలో "షావుకారు లేదా వడ్డీ వ్యాపారి వ్యవసాయానికి సహాయకారి కాక, కొన్ని ప్రాంతాల్లో పీడకుడిగా తయారైనాడు. అతడు వసూలు చేసే అధిక వడ్డీ, వ్యవసాయదారుల అజ్ఞానాన్ని, అవసరాలను తన స్వార్థానికి అవకాశంగా వాడుకోవటం తదితర కారణాలతో వ్యయవసాయదారునిపై భరించలేనంత రుణభారం పడుతున్నది" అని వివరించింది. 100 సంవత్సరాల తరువాత పరిస్థితి మారింది. ఏమిటా మార్పు అంటే వడ్డీ వ్యాపారస్తులు ప్రభుత్వరంగ బాంకులు కూడా పీడకుల జాబితాలో చేరారు.

ఈ పీడకుల నుంచి ప్రభుత్వం అనంతపురం రైతాంగానికి విముక్తి కలిగించాలి. కలిగించకపోతే, అపనేదో రైతులనే వారి పద్ధతిలో చేసుకోనివ్వాలి.

❐

# భాగస్వామ్య సదస్సు సాధించినదేమిటి?

- వి.కొమరయ్య

భారత పారిశ్రామిక సమాఖ్య (కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ - సి.ఐ.ఐ.), ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం సంయుక్తంగా 2003 భాగస్వామ్య సదస్సును హైదరాబాద్‌లో జనవరి 4-8 తేదీల్లో జరిపాయి. సిఐఐ వివిధ రాష్ట్ర ప్రభుత్వాలతో కలిసి సంయుక్తంగా జరుపుతూ వచ్చిన భాగస్వామ్య సదస్సుల్లో ఇది తొమ్మిదవది కాగా ఆంధ్రప్రదేశ్‌లో రెండవది. గతంలో 2001 భాగస్వామ్య సదస్సు కూడా చాలా ఆర్భాటంగా జరిగి, 37,000 కోట్ల రూపాయలు పెట్టుబడులు రాష్ట్రంలోకి ప్రవహిస్తాయని ఒప్పందాలు కూడ జరిగి, రెండు సంవత్సరాలు గడిచిన తర్వాత, కేవలం 3700 కోట్ల రూపాయల పెట్టుబడుల పనులు ప్రారంభమైన నేపథ్యంలో ఈ రెండో భాగస్వామ్య సదస్సు జరిగింది.

'వ్యాపారాల అనుసంధానం - దేశాల సమ్మేళనం' అనే ప్రధాన ఇతివృత్తంతో జరిగిన ఈ సదస్సులో పన్నెండు ప్లీనరీ సమావేశాలు, ప్రారంభ, ముగింపు సమావేశాలతోపాటు ఇరవైకి పైగా భోజన సమావేశాలు, మరెన్నో ప్రత్యేక సంభాషణలు జరిగాయి. డెబ్భైకి పైగా ప్రపంచ ప్రసిద్ధులైన ఉపన్యాసకులు, నిపుణులు వివిధ అంశాల మీద మాట్లాడారు. దాదాపు వెయ్యిమంది పారిశ్రామిక వేత్తలు, వాణిజ్యవేత్తలు, బహుళ జాతి సంస్థల, దేశీయ వ్యాపార సంస్థల ప్రతినిధులు పాల్గొన్నారు.

అసలే అప్పులతో కునారిల్లుతున్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో రూ.నాలుగు కోట్లకు (అధికారిక అంచనాలు రు.2 కోట్లు. ఖర్చు కనీసం మూడు రెట్లు ఉంటుందని అనధికారిక అంచనా) పైగా ఖర్చుపెట్టి నడిపిన ఈ భాగస్వామ్య సదస్సు, రాష్ట్రానికి ఏమి మేలు చేస్తుందని పరిశీలించడం అనవసరం. సదస్సు సాగిన నాలుగు రోజులూ రాష్ట్ర, కేంద్ర మంత్రులు, ప్రభుత్వాధికారులూ ఆ సదస్సును గొప్పగా పొగిడిన భోగట్టా పత్రికలలో వచ్చిందిగాని, పొగిడిన వారందరికీ సదస్సు వల్ల ఏవో ప్రయోజనాలున్నాయనే సంగతి బహిరంగ రహస్యమే.

సదస్సు ప్రజాధనంతో జరిగింది గనుక సదస్సులో అసలు ఏం జరిగిందో, దానివల్ల తమకు ఏ ప్రయోజనాలు కలగనున్నాయో ప్రజలు తెలుసుకోవాలనుకోవడం సమంజసం. ప్రజలవైపు నుంచి, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ వైపునుంచి సదస్సు బాగోగులను, సదస్సువల్ల సమకూర గలిగిన ప్రయోజనాలను చర్చించడం ఇంతవరకు జరగలేదు.

అన్నం ఉడికిందా లేదా చూడడానికి ఒక్క మెతుకు చూసినట్టు, భాగస్వామ్య సదస్సు వల్ల రాష్ట్ర ప్రజలకు, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు ఏమైనా మేలు జరుగుతుందా లేదా చూడడానికి కుదిరిన ఒప్పందాలను పరిశీలిస్తే సరిపోతుంది. మళ్ళీ, ఈ ప్రకటించిన ఒప్పందాలలో కూడ ఎన్ని నిజంగా అమలవుతాయో నమ్మకం లేనప్పటికీ, అన్నీ అమలయితే కూడ రాష్ట్ర ప్రజలకు అది ఏమన్నా ఉపయోగకరమైనదో లేదో పరిశీలించాలి.

పెట్టుబడులను ప్రమాణంగా తీసుకోవడం ఎందుకంటే, ఆ పెట్టుబడులతో పరిశ్రమలో, వాణిజ్య సంస్థలో రూపొందితే అవి ఆయా స్థాయిలో ప్రత్యక్ష ఉద్యోగ కల్పనకు దారి తీస్తాయి. ఆ పరిశ్రమలకు, వాణిజ్య సంస్థలకు ముందూ, వెనుకా రూపొందే అనుబంధ వృత్తుల వల్ల పరోక్ష ఉపాధి పెరుగుతుంది. ఆ సంస్థలు చేసే ఉత్పత్తుల వల్ల, వ్యాపారాల వల్ల, కట్టే పన్నుల వల్ల రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు అదనపు వనరులు చేకూరుతాయి - ఇదంతా అర్థశాస్త్ర పాఠ్యపుస్తకాలు ఇచ్చే వివరణ. దీనికన్న ముందు ఆయా పెట్టుబడిదారులకు స్థానిక వనరులను కొల్లగొట్టడానికి, స్థానిక మార్కెట్లను విస్తరించుకోవడానికి, లాభాలు పెంచుకోవడానికి వీలు కలుగుతుంది.

ఈ అవగాహనతో భాగస్వామ్య సదస్సు ఒప్పందాలను పరిశీలిస్తే వాటిలో నిజంగా అమలయ్యేవి తక్కువ. అమలయినా ఉపాధి కల్పనకు, రాష్ట్రానికి అదనపు వనరులకు వీలు కల్పించేవి తక్కువ. పెట్టుబడిదార్లకు లాభాలు, అధికారంలో ఉన్నవాళ్లకు ముడుపులు సమకూర్చి పెట్టేవి ఎక్కువ.

ఇప్పుడు ప్రకటించిన రు.17,204 కోట్లలో రు.642 కోట్లు ఒప్పందాలు కూడా కావు. కేవలం ఆసక్తి ప్రకటనా లేఖలే. అటువంటి లేఖలను ఆయా సంస్థల యజమానులు అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చే ఉంటారు. అవి ఒప్పందాల దశకు రావడానికే చాల సమయం పడుతుంది. ఆ తర్వాత కూడ అవి అమలవుతాయో లేదో చెప్పలేం.

ఇక ఒప్పందాలు కుదుర్చుకున్న రు.16,562 కోట్లలో రు.12,000 కోట్లది ఒకే పద్దు. ట్రాన్స్‌వరల్డ్ రిఫైనరీస్ పేరిట పెట్రోలియం ఉత్పత్తుల ప్రాజెక్టుగా ప్రకటించిన ఈ ఒప్పందం ఏడెనిమిది సంవత్సరాల కింద మురిపించి, అటకెక్కిన బ్లాక్ గోల్డ్‌కు మరోరూపం అంటున్నారు. ఒక వేళ ఇది కొత్తదే అయినా ఇంత భారీ, పెట్రోలియం ఉత్పత్తుల ప్రాజెక్టు రావాలంటే, ముందూ వెనకా అనేక అనుబంధ పరిశ్రమల, పెట్రోలియం కొనుగోళ్ళ ఒప్పందాలు కుదరవలసి ఉంటుంది. అవేవీ కుదరకుండా ఇంత భారీ ప్రకటన చేయడం జనాన్ని అంకెల గారడీతో మోసం చేయడం తప్ప మరేమీ కాదు.

ఇక మిగిలిన రు.4,562 కోట్ల ఒప్పందాలలో కూడా హైదరాబాద్ నగరంలో కడుతున్న రియల్ ఎస్టేట్ ప్రాజెక్టుల దగ్గరి నుంచి, శ్రీ కృష్ణ చైతన్య అనే అమెరికన్ ధార్మిక సంస్థ నిర్మించదలచుకున్న మత ప్రార్థనా క్షేత్రం వరకూ ఏవి దొరికితే అవి గుదిగుచ్చి ఒక పెద్ద అంకె చూపించడానికి ప్రభుత్వం పడిన ప్రయాస కనబడుతుంది.

2001 భాగస్వామ్య సదస్సు సందర్భంగా రు.37,000 కోట్ల ఒప్పందాలు కుదుర్చుకున్నారని, రు.75,000 కోట్ల పెట్టుబడులు రావడానికి సిద్ధంగా ఉన్నాయని, రు.1,12,000 కోట్ల లెక్కలు చెప్పిన ప్రభుత్వం, ఏడాదిన్నర తిరిగే సరికి ఆ రు.75,000 కోట్లను గాలికి వదిలేసి, రు.37,000 కోట్లలోనే పంచపాండవులు మంచం కోళ్ళ సామెతలోకి దిగింది. ఈ సారయినా ప్రకటించిన రు.17,204 కోట్లలో ఏయే ప్రాజెక్టులు ఎప్పుడెప్పుడు ఎంతెంత పెట్టుబడి తెస్తాయో, ఎంతెంత మందికి ఉపాధి కల్పిస్తాయో వేచిచూడాలి.

**కొసమెరుపు:** భాగస్వామ్య సదస్సులో చాల వరకు సమాచారం నిండిన ఉపన్యాసాలు, పాకిస్తాన్ భవిష్యత్తు, ఇరాక్‌యుద్ధం వంటి "రాజకీయ" అంశాలు, భారీ కార్పొరేషన్లు కూలిపోయిన వైనం (ఉదా. ఎన్రాన్, వరల్డ్‌కామ్) మొదలైన పాఠాలు వంటి ఆసక్తికరమైన అంశాలు చోటు చేసుకున్నాయి.

## భాగస్వామ్య సదస్సు సందర్భంగా సంతకాలు జరిగిన ఒప్పందాలు

| | | |
|---|---|---|
| **I.** పరిశ్రమలు. వాణిజ్య శాఖ | | |
| 1. ట్రాన్స్‌వరల్డ్ రిఫైనరీస్ లిమిటెడ్ | రు. 12000 కోట్లు | -పెట్రోలియం ఉత్పత్తులు |
| 2. ఐ.టి.సి. పేపర్ ప్రాజెక్ట్ | 260 .. | - స్పెషాలిటీ పేపర్ |
| 3. ఫ్రైజరియో అల్లానా కన్జర్వా | 25 .. | - పౌల్ట్రీ ప్రాసెసింగ్ |
| 4. షాపుర్జీ పల్లొంజీ బయోటెక్ పార్క్ | 10 .. | - బయోటెక్ పార్క్ |
| 5. టెకుమ్‌సె ఇండియా | 50 .. | - విస్తరణ |
| 6. కాప్‌కోల్ అల్యూమినియం స్మెల్టర్ | 2,400 .. | - అల్యూమినియం స్మెల్టింగ్ |
| 7. కెమ్‌ప్లాస్ట్ | 600 .. | - పివిసి |
| 8. బి.ఎచ్.పి మినరల్స్ | 32 .. | - |
| **II.** పర్యాటక శాఖ | | |
| 9. అగ్రిగోల్డ్ ఎంటర్‌టెయిన్‌మెంట్ రిసార్ట్ | 150 .. | - విజయవాడ, విశాఖల్లో థీమ్ పార్క్‌లు |
| 10. ప్రజయ్ ఇంజనీరింగ్ | 50 .. | - షామీర్‌పేటలో థీమ్ పార్క్‌లు |
| 11. అగ్రిగోల్డ్ ఎస్టేట్స్ | 50 .. | - .. |
| 12. రాయ్ వండర్ లాండ్ | 32 .. | - అమ్యూజ్‌మెంట్ పార్క్ |
| 13. కె.ఎం.సి.ప్రాపర్టీస్ | 30 .. | - షాపింగ్ మాల్ |
| 14. రిలయన్స్ ఇండస్ట్రీస్ | 24 .. | - హైవే అమెనిటీస్ |
| 15. ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ | 24 .. | - .. |
| 16. ఇస్కాన్ | 20 .. | - రెలిజియస్ థీమ్ పార్క్ |
| 17. భాగ్యనగర్ ఎంటర్‌టెయిన్‌మెంట్ | 18 .. | - లేజర్ ఫిల్మ్‌షో |
| 18. కనకదుర్గా అమ్యూజ్‌మెంట్స్ | 7 .. | - భవానీ ఐలాండ్ రిసార్ట్ |
| 19. .. | 8 .. | - అమ్యూజ్‌మెంట్ పార్క్ |
| 20. రికర్షన్ సాఫ్ట్‌వేర్ | 8 .. | - కార్టూన్ ప్రాజెక్ట్ |
| 21. ఐ.టి.ఇ. గ్రూప్ | 8 .. | - ఫుడ్ కోర్ట్ |
| 22. జి.ఎస్.జి. బిల్డర్స్ | 105 .. | - మల్టిప్లెక్స్, షాపింగ్‌మాల్ |
| **III.** ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, కమ్యూనికేషన్స్ శాఖ | | |
| 23. కార్టూన్ స్టూడియోస్ | 15 .. | - ఆనిమేషన్ |
| 24. మెగాసాఫ్ట్ | 45 .. | - సాఫ్ట్‌వేర్ సర్వీసెస్ |
| **IV.** వ్యవసాయ శాఖ | | |
| 25. కొలొనాక్ ఇంటర్నేషనల్ | 2 .. | - జీడిపప్పుతోట |
| 26. బ్రూయర్స్ నెస్ట్ | 9 .. | - ఔషధ తోట |
| 27. హైదరాబాద్ నర్సరీ | 15 .. | - ఫ్లోరాపార్క్ |
| 28. బైడల్ సిల్క్ టెక్నాలజీస్ | 498 .. | - సిల్క్ ప్రాసెసింగ్ |
| **V.** పశుసంవర్ధక శాఖ | | |
| 29. ఫిషింగ్ ప్రాజెక్ట్ | 68 .. | - టునా ఫిష్ ప్రాసెసింగ్ |
| ఆసక్తి ప్రకటనా లేఖలు | | |
| 30. బయో జీనస్ ఇండియా | 300 .. | - ప్రాన్ బయోఫెర్టిలైజర్స్ |
| 31. పసిఫిక్ హెల్త్‌కేర్ | 50 .. | - గైనిక్ - నియోనేటాలజీ |
| 32. ఎబిఎల్ బయోటెక్నాలజీ | 12 .. | - ఫాటీ ఆసిడ్స్ |
| 33. పవర్‌మాటిక్ పాకేజింగ్ | 50 .. | - కాయిన్ బ్లాంకింగ్ |
| 34. గోపతి ఇండస్ట్రీస్ | 5 .. | - ఆఫీస్ మాడ్యులర్ సిస్టమ్స్ |
| 35. మైక్రోబయోమెడ్ | 72 .. | - బల్క్ బయోఫార్మస్యూటికల్స్ |
| 36. ఒంకొనావో థెరాప్యుటిక్స్ | 50 .. | - ఆంటీ కాన్సర్ మాలిక్యూల్స్ |
| 37. ఆమ్‌కేర్ లాబ్స్ | 25 .. | - మెడికల్ ఫెసిలిటీస్ |
| 38. సాండర్ మెడికేర్ | 15 .. | - హెల్త్‌కేర్ ఫెసిలిటీస్ |
| 39. ఆక్టివా బయోటెక్ | 14 .. | - అల్ఫా ఇంటర్‌ఫెరాన్ |
| 40. బయోటెక్ వెంచర్‌ఫండ్ | 10 .. | - వెంచర్ కాపిటల్ |
| 41. ట్రయాడ్ ఫ్లీట్ కంట్రోల్ | 39 .. | - ఫ్యుయెల్ మేనేజిమెంట్ |

**మొత్తం సంతకాలయిన ఒప్పందాలు - 29 రు. 16,562 కోట్లు**
**ఆసక్తి ప్రకటనా లేఖలు - 12 రు. 642 కోట్లు**
**మొత్తం రు. 17,204 కోట్లు**

నాలుగు రోజుల్లోనూ సునీల్ భారతి మిత్తల్ నుంచి శామ్ పిట్రోడా నుంచి జార్జి ఫెర్నాండెజ్ దాకా ఎవరో ఒకరు అమెరికా ఆధిపత్యం మీద తీవ్రవిమర్శలు సాగించడం ఆసక్తికరమైన అంశం. నిజానికి, అదే సమయంలో హైదరాబాదులో జరుగుతున్న ఆసియా సామాజిక వేదికకన్నా తీవ్రమైన అమెరికా వ్యతిరేకతను భాగస్వామ్య సదస్సులో కనీసం అరడజను మంది ఉపన్యాసకులు ప్రకటించారు. దీన భావమేమి తిరుమలేశా?! ❑

# పదికోట్ల ఎకరాల భూమి పడావు పెట్టిన ప్రభుత్వం

- భానుప్రతాప్‌సింగ్

విధాన నిర్ణేతలు, బుద్ధిజీవులు పట్టణాల్లో నివసిస్తుంటారు. గ్రామీణ ప్రాంత పరిస్థితులు వారికి తెలియవు. ప్రజలకు తిండిపెట్టే రైతు గురించి, వ్యవసాయం ఎలా దిగజారిపోతుందీ వారు తెలుసుకోవాలి. బంగారు పంటలు పండించే భూమి వుంది. అదే సమయంలో 370 లక్షల హెక్టార్ల భూమి వ్యవసాయయోగ్యమైనా పడావుగా పడి వుంది. అంటే పాకిస్తాన్, నేపాల్, బంగ్లాదేశ్, జపాన్ దేశాల్లో పంట భూమి కన్నా ఎక్కువ భూమి మన దేశంలో పంటకునోచుకోలేదు. కాల్వల్లో ప్రవహించే నీరు, వర్షపునీరు ఎక్కువగా సముద్రంలోకి పోతోంది. మేలిమి పంటలకు తోడ్పడే టాప్ సాయిల్ కొట్టుకుపోతోంది. నీరూ, భూమి ఇలా వృథా అయిపోతూంది.

సస్యవిప్లవానికి ముందు 1950-55/1965-70 మధ్యకాలంలో తిండిగింజల ఉత్పత్తి పెరుగుదల 2.51 శాతం కాగా, అప్పటి నుంచి 80-85 వరకు ఈ పెరుగుదల 3.12 శాతానికి పెరిగి 1995-2000 నాటికి 2.39 శాతానికి పడిపోయింది. (అయిదు సంవత్సరాల సగటు) సస్యవిప్లవం రాకముందు పెరుగుదల రేటు కన్నా తక్కువ స్థాయికి పడిపోయింది. సాంవత్సరిక ఉత్పత్తి ఆధారంగా చూస్తే సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత దశాబ్ద కాలంలో, ఈ పెరుగుదల రేటు 1.06 శాతం మాత్రమే. అంటే జనాభా పెరుగుదల రేటుకన్నా తక్కువగానే పెరిగింది.

స్థూల జాతీయాదాయం లెక్కలు చూస్తే తొమ్మిదవ ప్రణాళికాకాలంలో వ్యవసాయం నుంచి ఆదాయం ప్రతి సంవత్సరం 4.5 శాతం చొప్పున పెరగాలని, ఆహార ధాన్యాల ఉత్పత్తి 23.40 కోట్ల టన్నులు వుండాలనే లక్ష్యాలను దరిదాపుల్లో కూడా సాధించలేకపోయాం. వ్యవసాయదారుల తలసరి ఆదాయంగాని, తలసరిపోషకాహార స్థాయిలోగాని తొమ్మిదవ ప్రణాళిక పెంచలేకపోయింది.

గత 25 సంవత్సరాల గణాంకాలను పరిశీలిస్తే, తలసరి రోజు వారి పోషకాహార స్థాయిని (సగటున 500 గ్రాములు) కేవలం రెండే రెండు సంవత్సరాల్లో మాత్రమే అందుకో గలిగాం. లేదా మార్జినల్‌గా అధిగమించగలిగాం. మనం తిండి గింజల విషయంలో స్వయం సమృద్ధి సాధించాం. ఎగుమతి కూడా చేస్తున్నాం అని చెప్పేవారు చెప్పని విషయమేమంటే అయిదు సంవత్సరాల వయస్సులోపు పిల్లల్లో 53 శాతం మంది అవసరమైనంత ఆహారం తీసుకోవటం లేదు. అందువల్ల ప్రతీ సంవత్సరం 15 లక్షల పిల్లలు చనిపోతున్నారు. అలాంటప్పుడు బిడ్డలకే సరైన ఆహారం పెట్టలేని పిల్లల తల్లితండ్రులు ముందు పిల్లలకు పెట్టకుండా ఏ తల్లీ తన కడుపు నిండాతినలేదు కదా. గమనించాల్సిన మరో విషయమేమంటే ఉన్నత ఆదాయాలున్న వారు పాలు, గుడ్లు, మాంసాహారాలు ఎక్కువగా, తింటూండడంతో, పశువులకు ఇతర జంతువులకు తిండి గింజలు వేసాల్సిరావటంతో, మనుషులకు తిండిగింజలు తక్కువవుతున్నాయి.

ఉత్పాదకత ఇంత తక్కువ వుండటానికి గల కారణాలను ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రిసెర్చ్ (భారత ప్రభుత్వ సంస్థ) అధ్యయనం చేయగా, ఎక్కువలో ఎక్కువ ఉత్పాదకతను సాధించిన పంజాబు, హర్యానాల్లోకూడా వాటి సామర్థ్యంలో 79 శాతం, 51 శాతం మాత్రమే సాధించగలిగాయి. దేశం మొత్తంమీద చూస్తే, సామర్థ్యాన్ని రెండున్నర రెట్లు

**వ్యవసాయ సంస్కరణల ఎజెండా**

1. విద్యకోసం బడ్జెట్‌లో 6 శాతం కేటాయించి, 6-14వయస్సు గల బాల బాలికలకు నిర్బంధ విద్యగరపాలి.
2. అన్ని గ్రామాలకు పక్కా రహదారులు నిర్మించాలి.
3. రవాణాపై ఆంక్షలన్నింటిని తొలగించాలి.
4. గ్రామీణ గోదాముల నెట్‌వర్క్ ఏర్పాటు చేయాలి.
5. చవుక ధరల దుకాణాల వ్యవస్థను రద్దుచేసి, దానిస్థానే పనిచేసే శక్తి గలవారందరికి 'పనికి ఆహార పథకం' అమలు చేస్తే. వారందరికీ పని లభిస్తుంది. రహదారులు, డ్రెయినేజి, చెరువుల పూడిక తీసివేత లాంటి పనులు చేయించవచ్చు. గ్రామాలు, వ్యవసాయం బాగుపడతాయి.
6. నిరుపేదలకు, వికలాంగులకు కూపన్లు ఇవ్వాలి.
7. కనీస ధరకు ప్రభుత్వమే ఆహార ధాన్యాలు కొనాలి. ఇలా కొన్న తిండి గింజలను పనికి ఆహారం పథకం కోసం, ఎగుమతులకు మాత్రమే వినియోగించాలి.
8. నేరుగా గ్రామాల్లో ప్రాసెసింగ్ పరిశ్రమలు, శీతల కేంద్రాలు ఏర్పాటు చేసేవారికి ప్రభుత్వం సహాయం చేయాలి.
9. వ్యవసాయదారులకు భారీగా సబ్సిడీ ఇచ్చే సభ్యదేశాలనుంచి ఆహార ధాన్యాల దిగుమతులు చేసుకోగూడదు.
10. వ్యవసాయానికి పనికివచ్చే చిన్న సైజు యంత్రాలను లాంఛన కష్టమ్స్‌తో దిగుమతిని అనుమతించాలి.

పెంచే అవకాశమున్నా, రెట్టింపు మాత్రమే సాధిస్తేచాలు. దారిద్రం తొలగిపోవడమేకాక ప్రపంచంలోకెల్లా ఎక్కువ ఎగుమతి చేయగలుగుతాం.

ప్రకృతి మనకు అనుకూలంగా వున్నా కూడా ఆహార ధాన్యాల పంట విషయంలో హెక్టారుకు సగటు పంటలో మనం వెనుకబడి వున్నాం. ఆసియాలో సగటు పంట 3156 కిలోలైతే, మన దేశంలో అది 2232 కిలోలు మాత్రమే. అదే తలసరి ఉత్పత్తి అనే కోణం నుంచి చూచినా గత 25 సంవత్సరాల కాలంలో ప్రపంచంలో ఎంత లభ్యమవుతూందో, అందులో 64 శాతం మాత్రమే ఉత్పత్తి అవుతుందంటే మన అభివృద్ధి ఎంతగొప్పగా వుందో అర్థం చేసుకోగలుగుతాం. ప్రపంచాన్ని అలా వదిలిపెట్టి, వ్యవసాయంలో మన పొరుగు దేశాలతో పోల్చిచూచినా సగటు సాంవత్సరిక అభివృద్ధి 1980-98 మధ్య కాలంలో చైనాలో 5.18 శాతం, వియత్నాంలో 4.65 శాతం, పాకిస్తాన్‌లో 4.04 శాతం, నేపాల్‌లో 3.24 శాతం కాని, మన దేశంలో 2.39 శాతం వుందంటే మనం సిగ్గుతో తలవంచుకోవాలి. ఇలా ఎందుకుంది?

దేశంలో అక్షరాస్యత బ్రహ్మాండంగా పెరిగిపోతోందని పాలకులు జబ్బలు చరుచుకుంటున్నారు. తన పొలం ఎంత పొడవుంది, ఎంత వెడల్పుంది, ఎంత ఎరువు వాడాలో ప్రతి నలుగురు రైతుల్లో ముగ్గురికి తెలియదు. కాబట్టి వారి జనరల్ విజ్ఞానాన్ని, వ్యవసాయ సంబంధమైన విజ్ఞానాన్ని పెంచాలి. పెట్టుబడుల విషయంలో ప్రభుత్వం కేటాయింపులను తగ్గిస్తూ వచ్చిందని ప్రభుత్వ గణాంకాలే చెబుతున్నాయి. అటు విజ్ఞానం, ఇటు పెట్టుబడి ఇలా వుంటే విజ్ఞానాన్ని పెంచాలి. పెట్టుబడుల విషయంలో ప్రభుత్వం కేటాయింపులను తగ్గిస్తూ వచ్చిందని ప్రభుత్వ గణాంకాలే చెబుతున్నాయి. అటు విజ్ఞానం, ఇటు పెట్టుబడి ఇలా వుంటే వ్యవసాయ శాఖ, ప్రణాళికా సంఘం ఈ దుస్థితి గురించి హెచ్చరికలు చేస్తూ వస్తున్నా ప్రభుత్వం ఆ హెచ్చరికలను పెడచెవిన పెట్టింది. వ్యవసాయం, తత్సంబంధిత రంగాలు, గ్రామీణాభివృద్ధి, నీటి పారుదల మీద ఖర్చు మొదటి ప్రణాళికలో 37 శాతం నుంచి తొమ్మిదో ప్రణాళికలో 20 శాతానికి తగ్గిపోతే, ఆ 20 శాతంలో కూడా ఎక్కువ ఖర్చు పాప్యులిస్టు పథకాలమీద వెచ్చిస్తూపోతే వ్యవసాయం ఎలా అభివృద్ధి అవుతుంది?

కమతాలు చిన్నవైతే ఉత్పత్తి దెబ్బతింటుంది. అందుచేత కార్పొరేట్ రంగాన్ని వ్యవసాయంలోకి తీసుకురావాలని వాదించేవారు వాస్తవాలకు విరుద్ధంగా మాట్లాడుతున్నారు. 70 శాతం చిన్న, సన్నకారు కమతాలున్న మన దేశంలో వ్యవసాయాన్ని కార్పొరేటీకరణం చేయడమంటే పేద రైతాంగం మరణ శాసనం రాయడమే అవుతుంది. చైనా, జపాన్, దక్షిణ కొరియా, వియత్నాం, శ్రీలంక దేశాల వ్యవసాయ గణాంకాలు పరిశీలిస్తే, సగటున మనకన్నా తక్కువ విస్తీర్ణం వున్న కమతాలున్నా, భారతదేశంకన్నా, ఆదేశాల్లో హెక్టారుకు సగటు పంట ఎక్కువగా వుంది. ఉదాహరణకు సగటు విస్తీర్ణం 0.20 హెక్టారు వున్న వియత్నాంలో హెక్టారుకు తిండిగింజల పంట 9657 కిలోలుకాగా, మన దేశంలో సగటు విస్తీర్ణం 0.63 హెక్టారువున్నా, పంట 2232 కిలోలు మాత్రమే. ప్రభుత్వం ప్రకటించిన కనీస ధరకు రైతుల నుంచి కొంటున్నామనేది కూడా వాస్తవం కాదు. ఉదాహరణకు 2000-01 (ఫిబ్రవరి 2001వరకూ)లో ప్రభుత్వం ఆధరకు కొన్న ఆహార ధాన్యాల్లో 81 శాతం కేవలం పంజాబ్, హర్యానా, ఆంధ్రప్రదేశ్ మూడు రాష్ట్రాలనుంచే కొనుగోలు చేసింది. దేశంలో మొత్తం ఉత్పత్తిలో ఈ మూడు రాష్ట్రాల ఉత్పత్తి 25 శాతం మాత్రమే అయినా సేకరించిన ఆహార ధాన్యాల్లో 81 శాతం ఈ మూడు రాష్ట్రాల నుంచి మాత్రమే నన్నమాట. అంటే మిగతా 14 పెద్ద రాష్ట్రాల్లో దేశం మొత్తం ఉత్పత్తిలో 75 శాతం అయినా, ప్రభుత్వం 19 శాతం మాత్రమే కొనుగోలు చేసింది. ఈ వివక్ష అన్యాయం. ఈ అన్యాయాన్ని మరో కోణం నుంచి కూడా పరిశీలించవచ్చు. 1999-00, 2000-01 సంవత్సరాల్లో ధాన్యం రూపంలో, రైతుల నుంచి సేకరించింది కేవలం 38.3 శాతం మాత్రమే కాగా, మిగతాది మిల్లర్లనుంచి బియ్యం లెవీ రూపంలో రవాణా సేకరించింది. మిల్లర్లు కనీస ధర చెల్లించి రైతుల వద్దనుంచి సేకరించితీరాలనే నిబంధన ఏమీలేదు. కాగా కనీస ధర చాలా తక్కువ మంది రైతులకే దక్కుతుంది.

ఇంకో విషయం 2000-01లో గోధుమ, బియ్యం, 154.76 మిలియన్ టన్నులు సేకరించింది. ఇది మొత్తం పంటలో 20.48 శాతం మాత్రమే. అయితే ఇతర ముతక ధాన్యాల పంట మొత్తం 30.25 మిలియన్ టన్నులైతే, సేకరించింది 0.33 మిలియన్ టన్నులు (1.09 శాతం) మాత్రమే. ఈ ముతక ధాన్యాలనే పేద ప్రజలు ఎక్కువగా తింటారు. కాని పేద రైతుకు ప్రభుత్వం అన్యాయం చేస్తుంది. ఈ ముతక ధాన్యాలయితే ప్రపంచ విపణిలో ఎక్కువ ప్రాముఖ్యత వుంది. గోధుమ వ్యాపారం సుమారు 100 మిలియన్ టన్నులైతే ముతక ధాన్యాల వ్యాపారం కూడా అంతే వుంది. బియ్యం వ్యాపారం అత్యల్పం. మానవుడికి కావాల్సిన పోషకాహార విలువలు 460 గ్రాముల ఆహార ధాన్యాలు, 40 గ్రాముల పప్పుదినుసులు తింటేనేగాని లభించవు. కాని దేశంలో తలసరి ఆహారం 75-79లో 505 గ్రాముల బియ్యం, 34 గ్రాముల పప్పుదినుసుల నుంచి 96-97లో 450 గ్రాములు, 27 గ్రాములకు పడిపోయింది.

పండించటం ఎంత ముఖ్యమో, పంట అమ్మకం కూడా అంతే ముఖ్యం. ప్రయివేటు వ్యాపారులు, ఫుడ్ కార్పోరేషన్ కొనుగోలు చేసి అమ్ముతారు. లాభం సంపాదించడమే ప్రయివేటు వ్యాపారుల లక్ష్యం కాబట్టి, వాళ్లను పక్కన పెట్టి, ఫుడ్ కార్పోరేషన్ తీరు తెన్నులు చూస్తే 2000-01లో చవక దుకాణాల ద్వారా విడుదలచేసిన ఆహార ధాన్యాలు 1.79 కోట్ల టన్నులు. ఇందుకుగాను కార్పోరేషన్ నష్టం రు.12,125 కోట్లు. ఈ మొత్తాన్ని సబ్సిడిగా ప్రభుత్వం కార్పోరేషన్‌కు చెల్లించింది పేదవాళ్ళకే ఈ సబ్సిడీవల్ల లాభం

(తరువాయి 23 పేజీలో)

# ప్రజారోగ్యంపై రాష్ట్రపతికి బహిరంగ లేఖ

గౌరవనీయులైన భారత దేశ రాష్ట్రపతి
శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలామ్‌గార్కి

సర్,

విషయం - ప్రజల ఆరోగ్య అవసరాలు

ఓ శాస్త్రజ్ఞుడిగా, భారతీయుడిగా, వ్యక్తిగా మిమ్మల్ని అభిమానించే భారత పౌరులలో నేనొకణ్ణి. మీరు ఆ మధ్యన హైదరాబాదు వచ్చిన సందర్భంలో ఎన్నో సందేశాలు ఇవ్వడం జరిగింది. అయినా మీరింకా ఓ మిసైల్ శాస్త్రజ్ఞుడి పరిధిలోనే ఆలోచిస్తున్నారని చెప్పడానికి సాహసిస్తున్నాను. అందుకనే స్వాతంత్ర్యం వచ్చిన 50 సంవత్సరాల తర్వాత కూడా అతిహీనమైన పరిస్థితుల్లో బతుకులను లాగుతున్న అశేష నిర్భాగ్యుల అవసరాల గురించి కానీ, ఆశల గురించికాని మీరు స్పందించలేకపోయారు.

వైద్య రంగాన్ని గురించిన మీ ఆలోచనలు, సందేశం టెలి మెడిసిన్, గ్రామాలలో కూడా యాంజియోగ్రాములు, కొత్త కొత్త మందులు, వ్యాక్సిన్లు - పరిధులకు మాత్రమే లోబడి ఆరోగ్య రక్షణకు బదులుగా చికిత్సకే ఉపయోగపడేటట్లున్నాయనడంలో సందేహం లేదు. ప్రపంచ ఆరోగ్య సంస్థ వెలిబుచ్చిన అభిప్రాయం ప్రకారం ఆరోగ్యానికి ప్రమాణం వ్యాధులు లేకపోవడం, భౌతిక మానసిక, సాంఘిక సమతుల్యమే. అల్మా ఆటా వేదిక కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చుతూ పూర్తి ఆరోగ్య పరిస్థితికి ఆర్థిక, సాంఘికాభివృద్ధి చాలా ముఖ్యమైనదని చెప్పింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ వెలువరించిన ఓ రిపోర్టులో బీదతనమే అతిదారుణమైన వ్యాధి అని పేర్కొనబడింది. విచిత్రమైన విషయం ఏమిటంటే మనదేశంలో ఎక్స్‌ప్రెస్ రహదార్లకు, ఫ్లై ఓవర్లకు, పర్యాటకుల సదుపాయాలకు (కేసినోలతోసహా), ఎం.ఎల్.ఎల మంత్రుల, అధికారుల విదేశీ యాత్రలకు ధనం ఎంతైనా వుంది గాని, ఎటువంటి నివాసానికైనా నోచుకోని నిర్భాగ్యుల నివాసానికి, గోడౌన్లలో బియ్యం మురిగిపోతున్నా ఆకలితో అలమటిస్తున్న లక్షలాది అభాగ్యుల ఆకలి తీర్చడానికి, గొంతుక ఎండి పోతున్నా నీరు లేక బాధపడుతున్న వారికి, చిక్కివున్నా బక్క శరీరాలను కప్పుకోడానికి బట్ట పీలికైనా లేని దరిద్రులకు మట్టుకు ధనంలేకపోవడం ఎంత విచిత్రం!

సర్! ఆరోగ్య రక్షణ, సాంఘిక న్యాయం ఒకదానితో ఒకటి ముడిపడివున్నాయి. తినడానికి తిండి, ఉండడానికి ఇల్లు, త్రాగడానికి నీరు, కప్పుకోవడానికి బట్ట బతకడానికి జీవనాధారం - వీటిని గురించి పట్టించుకోక ఆరోగ్యాన్ని గురించి ఇచ్చే సందేశాలు హాస్యాస్పదమే! నూటికి 80 శాతం వ్యాధులు కలుషిత త్రాగు నీరు మూలంగానని, నూటికి 90 శాతం వ్యాధుల చికిత్సకు ఏ స్పెషలిస్టులూ అవసరం లేనేలేదని తెలిసినాకూడా దేశంలోని ప్రముఖులందరూ కూడా క్రొంగొత్త పరికరాల మీద, లాభార్జనే ధ్యేయంగా ఉన్న వైద్య వ్యాపారుల మీద ఆధారపడిన చికిత్సావిధానాలను, సంస్థలను వెనకేసుకురావడం దురదృష్టకరం.

స్వాతంత్ర్యం వచ్చిన 50 సంవత్సరాల తరువాత కూడా మన దేశంలో రాజస్థాన్‌లోను, ఒరిస్సాలోను, ఆంధ్రప్రదేశ్‌లోను ఆకలి చావులు సంభవించడం సిగ్గుచేటు. లక్షలాది మంది వెతుకుకోసం అల్లాడిపోతున్నారు. నివాసం లేక చలికి ఎండకు ప్రాణాలు వదులుతున్నారు. త్రాగడానికి నీరును కూడా నోచుకోని పరిస్థితుల్లో వున్నారు. వారికే నూతన మందులు కావాలో చెప్పండి? వారికెటువంటి చికిత్సా విధానం కావాలో చెప్పండి? వారికి గుండెను పరీక్షించే ఆధునాతనమైన పరికరాలా కావాల్సింది? వారికి కావాల్సింది టెలీమెడిసినా? వారికి కావలసింది యాంజియోప్లాస్టి బైపాస్ ఆపరేషన్లా? వారికి కావాల్సింది రకరకాల వ్యాక్సిన్లా? ఇవేవి కానేకావు. గౌరవప్రదమైన మానవులుగా జీవించడానికి వారికి కావల్సింది కూడు, గూడు, నీరు, జీవనాధారం ఇత్యాదులు. బతుకులు ఈడ్చడం ముఖ్యం. వారు జీవించాలి. మరి వేలకోట్లాది రూపాయలు అప్పులుగా తెస్తున్న ప్రభుత్వాలు, ఎవరి అభివృద్ధికోసం ఈ ధనం వెచ్చిస్తున్నట్లు?

సర్! మీరు టెలిమెడిసన్‌ను ఎంతగానో ప్రశంసిస్తూ మాట్లాడారు. వినూత్న పరికరాల అభివృద్ధికోసం పోటీపడే శాస్త్రజ్ఞుడిగా మీరు మాట్లాడారు. కాని టెలిమెడిసిన్‌లో జరిగేదేమిటో మీకు తెలియనిది కాదు. రోగిని ఏమాత్రం పరీక్ష చేయకుండా కనీసం చూడను కూడా చూడకుండా యంత్రాల ద్వారా పంపించబడిన రిపోర్టులాధారంగా వ్యాధి నిర్ధారణ జరుగుతుంది ఈ ప్రక్రియలో. ఇది మౌలికంగా వ్యాధి నిర్ధారణ పద్ధతిలో వైద్యులకిచ్చే శిక్షణకు విరుద్ధం. దీని మూలంగా ప్రస్తుతం జరుగుతున్నదేమిటంటే ఈ టెలిమెడిసిన్ విధానాన్ని స్వంత లాభాల

కోసం ఉపయోగించుకుంటూ వైద్య వ్యాపార సంస్థలు రాష్ట్రంలో నలు మూలల్నుంచి, గ్రామాల నుంచి రోగులను రాజధానిలో వున్న ఆస్పత్రులకు తరలించి సొమ్ము చేసుకోవడం. దేశంలో గ్రామప్రజల వ్యాధి చికిత్స రంగాన్ని అభివృద్ధి చేయాలన్న తపన కనుక వుంటే గ్రామాలలో కూడా లేదా గ్రామాలకు సమీపంలో కాని అన్ని హంగులతో సమకూడిన, ప్రత్యేక శిక్షణ పొందిన డాక్టర్లు, నర్సులు, టెక్నీషియన్లతో కూడిన ఆస్పత్రులను పెంపొందించడం ముఖ్యం. గ్రామ ప్రజలకు కూడా ఇటువంటి సదుపాయాలుండడం వారి హక్కుగా గమనించాలి. గ్రామ ప్రజల ముంగిట శిక్షణ పొందిన వైద్య రంగానికి సంబంధించిన మానవ వనరులే వారి వ్యాధి చికిత్సావసరాలు. అటువంటి పరిస్థితిలో అధునాతనమైన పరికరాల సహాయంతో వైద్యాన్ని వ్యాపారంగా మార్చిన సంస్థలతో మీరు చేతులు కలపడం అతి దురదృష్టకరం.

సర్! అంతేనా. మీరు గ్రామాలలో గుండెను పరీక్షించే ఆధునాతన పరికరాలున్న సంచార ల్యాబరేటరీలుండాలని, అక్కడికక్కడే యాంజియోప్లాస్టీలాంటి ఆపరేషన్లు నిర్వహించడానికి సదుపాయాలుండాలని కూడా అభిప్రాయపడ్డారు. ఇటువంటి ఆలోచన యొక్క పరిణామాలు మీరు ఊహించగలరని ఆశిస్తున్నాను. ఇప్పటికే గుండె వ్యాధులపేరు చెప్పుకుంటూ లాభాలార్జించడమే ధ్యేయంగా పెట్టుకున్న వైద్యవ్యాపార సంస్థలు ఒకదానితో ఒకటి బజారున పడి పోటీలుగా ధరలు తగ్గిస్తూ ప్రకటనలు చేయడం సర్వ సాధారణం. ఇటువంటి ఆసత్రులన్నా, ఇటువంటి డాక్టర్లన్నా ప్రజల్లో గౌరవం తగ్గిపోయింది. అయినా ప్రాణ భీతితోనూ, గతిలేక ఆస్పత్రులను ప్రజలు సేవించడం జరుగుతున్నది. మీ ఆలోచనా ధోరణి మూలంగా నష్టపోయేది ప్రజలు, లాభపడేది వ్యాపారస్తులు వైద్యాన్ని వ్యాపారంగా మార్చిన ప్రబుద్ధులు మట్టుకే.

భారతీయ విద్యాభవన్ స్కూల్లో పిల్లల్ని కలలు కనాలని మీరు ఉద్బోధించారు. అయితే ఆకలి చంపుకోడానికి ఓ గుక్కెడు మంచి నీళ్ళైనా నోచుకోలేని లక్షలాది పిల్లలు ఏం కలలుకనాలో చెప్పగలరా? ముంబాయి వీధుల్లో రైల్వేప్లాట్‌ఫారాలమీద, బస్సుస్టాండులలోనూ, ఆలయాలలోనూ, పేవ్‌మెంట్లమీద బక్కపడిన కడుపునే చేతపట్టుకుని అతి దైన్యంగా మిమ్మల్నే చూస్తున్న ఎండిపోయిన కళ్ళతో సంరక్షణ లేక ముళ్ళుపడి పోయి మిగిలివున్న జుట్టుతో, బట్టపీలికలతో చిక్కి శల్యమైన శరీరాన్ని కప్పుకుంటున్న పిల్లలు చూడగలిగే కళ్ళకు కోకొల్లలుగా కన్పిస్తూనేవున్నారు. మన మందరం ఇటువంటి పిల్లల సంగతి పట్టించుకోనపుడు ఎవరెన్ని కలలు కంటే మాత్రం భారతదేశం బలీయమైన, శక్తివంతమైన దేశం కాగలదు?

దేశంలో మౌలిక సదుపాయాలను గురించి కూడా ప్రసంగించారు. మౌలిక సదుపాయాలంటే సమాచార సాధనాలు, రోడ్లు, విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రాలనే భావన ఎక్కువగా ప్రబలివుంది. కాని దేశంలో ఎక్కువ సంఖ్యలో వున్న మానవ వనరులే అతి కీలకమయిన మౌలిక సదుపాయాలన్న భావనతో మీరు ఏకీభవిస్తారని ఆశిస్తున్నాను. అట్టడుగున వున్న లక్షలాది బడుగు ప్రజలు, సాంఘికంగా వెనుకబడిన ప్రజలు రాజకీయంగాను, ఆర్థికంగాను, భౌతికంగా కూడాను అర్భకులై అతిహీనమైన పరిస్థితుల్లో బతుకులు సాగిస్తున్నవారి జీవ ప్రమాణాలు పెంపొందించడమే దేశానికి ఉపయోగపడే మౌలిక సదుపాయం అని చెప్పవచ్చును. వీరిని మరచి మనం టెలిమెడిసిన్, ఎక్స్‌ప్రెస్ హైవేలు, శాటిలైట్లు గురించి మాట్లాడ్డం అత్యంత విచారకరం.

సర్!

సంఘంలో అన్ని విధాలా అట్టడుగున అలమటిస్తున్న బడుగు ప్రజల అభివృద్ధి గురించి ఆలోచించగల అవకాశం మీకు వుంది. కాని మీరు ఆధునాతమైన శాటిలైట్ శాస్త్రజ్ఞుడి ఆలోచనా పరిధినుండి బయటపడి బడుగు వర్గాలతో సహా అందరూ సమాన సాంఘిక న్యాయం అనుభవిస్తూ సగౌరవంగా జీవించగలందులకు కృషి చేయగలరని ఆశిస్తున్నాను. దేశ ప్రజలు ఆరోగ్యంగా వుండాలన్నా, దేశం శక్తివంతంగా ఎదగాలన్నా ఇదొక్కటే మార్గమని భావిస్తున్నాను. దేశ భవితవ్యాన్ని నిర్ణయించేది యంత్రాలు కాదని, మానవుడేనని విశ్వసిస్తున్నా.

భవదీయుడు

**డా॥ పి.వి.ఆర్.భాస్కరరావు**

ఈ లేఖ రచయిత రాష్ట్రపతికి రాసిన ఆంగ్లలేఖకు రచయిత యొక్క స్వేచ్ఛానువాదం. స్థలాభావంవల్ల పూర్తి పాఠాన్ని అనువదించలేదు. ఇంగ్లీషులో రాష్ట్రపతికి పంపిన లేఖ యొక్క పూర్తి పాఠాన్ని కావాలనుకున్నవారు రచయితకు నేరుగా రాయగలరు.

డా॥ పి.వి.ఆర్ భాస్కరరావు, ఛైర్మన్ "పీం"
3-5-1092/2/సి, వెంకటేశ్వర కాలనీ, నారాయణగూడ.,
హైదరాబాదు.-29.

# వెనుకబాటుతనంలో కూడా స్త్రీలదే ముందడుగు

- ఎం.విద్యుల్లత

చదివిన పండితులగుదురు
విదితముగానున్న యపుడు వెర్రులె పురుషుల్
చదివిన జదువక యున్నను
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టువు చేతన్

వంద సంవత్సరాల క్రితం ప్రముఖ రచయిత్రి కాంచనపల్లి కనకాంబ రాసిన పద్యం అది. ఎంత విద్వత్తు అయినా అవకాశమున్నప్పుడే ప్రకాశిస్తుంది. ఆధునిక యుగమని చెప్పుకునే 20వ శతాబ్దంలో కూడా అవకాశాల్లేకే మహిళలు సమస్యలను ఎదుర్కొంటున్నారు. పుట్టుకనుంచి మరణం వరకు ప్రతినిత్యం ఆమె పోరాడుతూనే వుంది. స్త్రీ చంద్రమండలానికి వెళ్లినా, పైలెట్ అయినా పరిస్థితిలో మార్పు వచ్చిందా? అభివృద్ధి పథంలో అలా దూసుకువెళ్తున్న మహిళల శాతం ఎంత?

శతాబ్దపు తొలి జనాభా లెక్కల ప్రకారం ప్రతివేయిమంది పురుషులకు 972 మంది స్త్రీలుండగా, 1991 నాటికి 927కి తగ్గింది. ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ఆధునికమైన లింగ నిర్ధారణ పరీక్షలే దానికి కారణం. ఆరు సంవత్సరాల లోపు వున్న ఆడపిల్లల నిష్పత్తి 1991లో ప్రతివేయిమందికి 945 కాగా 2001 నాటికి 927కి తగ్గింది. స్త్రీల సంఖ్య ఆందోళన చెందాల్సినంత వేగంగా తగ్గుతుందనడానికి ఇంతకన్నా రుజువులక్కర్లేదు. పుట్టుకతోనే గ్రామీణ ప్రాంతాలలో వేయికి 75 మంది పసి పిల్లలు మరణిస్తున్నారు. అదే పట్టణ ప్రాంతంలో అయితే 37గా వుంది. నిరుపేద, దళిత వర్గాలలో ఈ తగ్గుదల మరీ ఎక్కువగా వుంది., పదేళ్ళలోపు పిల్లల్లో నూటికి 47 మంది పోషకాహార లోపం వుంటే, వారిలో అత్యధికులు ఆడశిశువులే. ఇక ఏటా కాన్పు సమయంలో లక్షా 25 వేల మంది మహిళలు మరణిస్తున్నారు. లక్షప్రసూతి కేసుల్లో 437 మరణాలు సంభవించడం ప్రపంచంలోనే అత్యధికం. ఆ రికార్డు మనమే బద్దలు కొడుతున్నాం.

విద్య, వైద్య, ఆరోగ్య, సామాజిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక రంగాలలో, ఇలా ఏ రంగంలో చూసినా స్త్రీ రెండవ తరగతి వ్యక్తే. చట్టాలు ఎన్నో చేస్తున్నా సరిగా అమలు పరచక పోవడమే దీనికి ప్రధాన కారణం. విలువల ముసుగులు తొడిగి స్త్రీని అంతకంతకు అణచివేసే సంప్రదాయాలు, సంస్కృతి, రాజకీయాలతో కలిసి చాపకింద నీరులా మారడంతో చట్టాలు నిరుపయోగమవుతున్నాయి. అందరికళ్ళనీళ్ళు తుడవడానికి ఏర్పడిన మహిళాకమీషన్ జాతీయ, రాష్ట్రస్థాయిల్లో ప్రభుత్వ శాఖలుగా మారిపోయాయి. అప్పుడప్పుడు సర్వేలు మాత్రం చేస్తున్నాయి. అందుకు ఉదాహరణగా ప్రతి 100 రేప్ కేసుల్లో 85 మంది శిక్ష పడకుండా తప్పించుకుంటున్నారనే అంశాన్ని ఒకే సర్వే తెలియచేసింది.

విద్యారంగంలో రిజర్వేషన్లు కొంత మేలు చేశాయి. అయినా కూడా దేశంలో బడికి దూరంగా వున్న 13 కోట్ల చిన్నారుల్లో 61 శాతం బాలికలే. ప్రాథమిక స్థాయిలో 43 శాతం బాలికలు పాఠశాలల్లో చేరుతుంటే, సెకండరీ స్థాయిలో అది 35 శాతం మాత్రమే. బాల కార్మికుల్లో 80 శాతం బాలికలే. ఎన్ని సంక్రాంతులు వచ్చి వెళ్లినా స్త్రీల అక్షరాస్యత దశాబ్దకాలంలో పెరిగింది 20 శాతం మాత్రమే (1991లో 34% కాగా 2001లో 54.2%), ఇప్పటికీ కొనసాగుతున్న బాల్య వివాహాలు జోగిని, మాతంగి మూఢాచారాలకు కారణం, నిరక్షరాస్యత అని ఓ వైపు చెప్తూనే రెండోవైపు బాలికల అక్షరాస్యతను నిర్లక్ష్యం చేస్తున్నారు. అయితే చదువుకున్న మహిళలందరూ ఆర్థిక స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వున్నారనుకుంటే పొరపాటే. పదో పరకో స్వంత ఖర్చులకు ఉపయోగించుకునే స్వేచ్ఛ సాధించుకున్నా, జీతం లెక్క చెప్పాల్సిందే. ఎంత విద్యాధికురాలైనా కట్నం మామూలే. ఎంత హోదాలో వున్నా వంటింటి బాధ్యత, పిల్లల పెంపకం స్త్రీలకే.

సరళీకొత ఆర్థిక విధానాలు, ప్రైవేటీకరణ, కరవు, యుద్ధాలు, తదితర అంశాలు (ధరల పెరుగుదలతో ఇంటిల్లి పాదీ పనులకు వెళ్లాల్సివస్తుంది) శ్రామిక మహిళల సంఖ్యను పెంచాయి. 96 శాతం మహిళా కార్మికులు అసంఘటిత రంగంలో అంటే బీడీ, అంగన్‌వాడీ, చేనేత, భవన నిర్మాణం, పొగాకు, పారిశుద్ధ్యం పనులు చేస్తున్నారు. రాత్రివేళల్లోకూడా పని చేయడం తప్పనిసరి అయింది. 1991 నాటికి శ్రామిక మహిళల శాతం 28.58 కాగా 1997 నాటికి 32 శాతానికి పెరిగింది. గృహ కార్మికులు మినహా వీరి సంఖ్య ఇదమిద్ధంగా చెప్పలేం. గృహ కార్మికులకు ఏవిధమైన చట్టాలు లేవు. శ్రామిక రంగంలో మహిళలకు కనీస వేతనాలు లేవు. కనీస వేతనం సంగతి అటుంచి చట్టాలున్నా సమాన వేతనాలు లభించటం లేదు. పురుషులకు లభించే వేతనాలలో 40 నుంచి 60 శాతం వేతనాలు మాత్రమే స్త్రీలకు లభిస్తున్నాయి. ప్రత్యేక టాయిలెట్స్, క్రెష్ సౌకర్యాలు పెద్ద పెద్ద కార్యాలయాలు, ఫ్యాక్టరీలలోనే మృగ్యం. (సంఘటిత రంగంలోని ఆర్.టి.సి. మహిళా కండక్టర్లు టాయిలెట్స్ లేకుండానే బాధ్యతలు నిర్వహిస్తున్నారు). శ్రామిక రంగంలో వారిశాతం పెరుగుతున్నా ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో పాత్ర లేదు. పురుషులదే రాజ్యం. మొత్తంగా చూస్తే స్త్రీల ఉపాధి కల్పన రేటు 1980లో 8 శాతంకాగా అది ప్రస్తుతం రెండు శాతం మందిమాత్రమే. సంఘటిత రంగంలో 1.44 నుంచి 0.46 శాతానికి ఉపాధి కల్పన తగ్గింది. వీటికి తోడు లైంగిక వేధింపులు. 1997లో సుప్రీం కోర్టు తీర్పును మన రాష్ట్రం ఇంతవరకు చట్టంగా చేయలేదు. మహానగరాంలో అయితే 98 శాతం మంది స్త్రీలు ఏదో ఒక దశలో లైంగిక వేధింపులకు గురవుతున్నారని ఐక్యరాజ్య సమితి అధ్యయనంలో తేలింది. స్త్రీని వ్యాపార వస్తువుగా ప్రసార సాధనాలలో చూపడమే కారణం. మరీ విశృంఖలంగానూ, ఆధునికత

పేరుతో అర్థ నగ్నంగా చూపితే రెండోవైపు గయ్యాళిగా, మూర్ఖురాలిగా, అబలగా, సుకుమారిగా, తల్లిగా, భార్యగా మీడియాలో చూపుతున్నారు. ఈ వైరుధ్యం గందరగోళంగా తయారైంది. వ్యభిచారం పెరిగింది. టూరిజంపేరుతో జరిగే అభివృద్ధి అంతా స్త్రీలపై ప్రభావం చూపుతోంది. కుటుంబ భారం స్త్రీల మీదపడడంతో వీరు వ్యభిచారాన్ని వృత్తిగా ఎంచుకుంటున్నారు. న్యూఢిల్లీ, ముంబాయి, కోల్‌కటా, గోవాలలో రెడ్‌లైట్ ఏరియాలో వున్న బాలికలు, స్త్రీలలో 12-35 ఏళ్ళ మధ్యవారు అత్యధికంగా ఆంధ్రరాష్ట్రానికి చెందినవారే. ఎయిడ్స్ వ్యాధిలో రాష్ట్రం రెండవ స్థానం. ఒక్క గోవా బీచ్‌లోనే 5 వేలమంది సెక్స్‌వర్కర్లు వుంటే, వారిలో 3500 మంది తెలుగువారే.

పేదరికం ప్రభావం అధికంగా స్త్రీలపైనే వుంటుంది. కుటుంబాలను పోషిస్తోన్న స్త్రీల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. విద్య, వైద్యం, ఆరోగ్యం, ఉపాధికల్పనల నిధులను కుదించడం వల్ల తిరిగి స్త్రీలపై ప్రభావం పడుతోంది. రాష్ట్రంలో రెండుకోట్లమంది చేతి వృత్తిదారులు, కోటి 50 లక్షల మంది వ్యవసాయ కార్మికులు వుంటే వారిలో 50 శాతం స్త్రీలే. ఆర్థిక విధానాల వల్ల ఇవన్నీ దెబ్బతిని వేలమంది స్త్రీలు ఉపాధికోల్పోయారు. 1996లో 16 రాష్ట్రాలలో మహిళాభివృద్ధి సూచికలు రూపొందించగా రాష్ట్రానికి 9వ స్థానం. అయినా కూడా రాష్ట్ర బడ్జెట్‌లో స్త్రీ శిశు సంక్షేమానికి ఒక శాతం నిధులు మాత్రమే కేటాయిస్తున్నారు. 2002-2003లో రాష్ట్ర బడ్జెట్‌లో ఈ శాఖకు 394.75 కోట్లు కేటాయించారు. అంటే ప్రతి మహిళకు ఏడాదికి తలసరి 103 ఖర్చు పెడతారన్నమాట. 200 పథకాలకు ఈ నిధులకు ఖర్చు పెడుతున్నారు.

వ్యవసాయరంగంలో 1951లో పొలాల్లో పనిచేసే మహిళల సంఖ్య 126 లక్షలవేగం 2001 నాటికి 300 లక్షలకు పెరిగింది. వ్యవసాయోత్పత్తిలో స్త్రీల శాతం 55-66 శాతం. హిమాలయ ప్రాంతంలో జరిగిన సర్వే ప్రకారం ఏడాదిలో హెక్టార్ భూమిలో ఎద్దులు 1064 గంటలు పనిచేస్తుంటే పురుషులు 1212 గంటలు పని చేస్తున్నారు. మరి మహిళలు 3845 గంటలు పనిచేస్తున్నారని తేలింది. కూలిరేట్లు చూస్తే పురుషులకి 70 రూ. ఇస్తే స్త్రీకి 30 రూ. మాత్రమే. విత్తనాల గ్రేడింగ్, నాట్లు వేయడం, మొక్కలు నాటడం, కోతకోయడం, గింజలు వలవడం, పశువుల మేత సేకరణ, పాడిపశువులు, కోళ్ళ పెంపకం అన్నింటిలోనూ స్త్రీలు పాలుపంచుకుంటున్నారు. పని చేయడం తప్ప భూమి, నీరు, మార్కెటింగ్ నిర్వహణ, వచ్చే రాబడులపై అవగాహనలేదు. అధికారం అంతకన్నా లేదు. రైతుల మహిళలను కలిసి సమస్యలను చర్చించడానికి, సలహాలు అందించడానికి వ్యవసాయ విస్తరణాధికారులు వెనకడుగు వేస్తున్నారు. కరవు వల్ల పురుషులు వలస పోవడడంతో కుటుంబ భారం స్త్రీలదే అయినా గుర్తింపులేదు.

నూతన వ్యవసాయ విధానంలో స్త్రీల సామర్ధ్యాన్ని, సాంకేతిక ప్రతిభనూ అభివృద్ధి పరుస్తున్నా, సంస్థాగత వ్యవహారాలలో అవకాశాలను ఇవ్వడంలో ప్రభుత్వం కూడా చొరవ చూపడం లేదు. వ్యవసాయ అనుబంధాలైన పశుపోషణలో 1.5 మిలియన్లు పురుషులుంటే 20 మిలియన్లు స్త్రీలున్నారు. పాడి పరిశ్రమలో పురుషులు 15 మిలియన్లుంటే మహిళలు 75 మిలియన్లు, మత్స్య పరిశ్రమలో చేపలు, రొయ్యలు మార్కెట్‌కు తరలించడంలో, వ్యవసాయ సంబంధిత కుటీర పరిశ్రమలో చీపుళ్ళు కట్టడం, తాళ్ళు పేనడం, పట్టుపురుగుల పెంపకంలో 51 శాతం మహిళలు వున్నారు.

నెంబర్‌వన్ రాష్ట్రం అయిన ఆంధ్రప్రదేశ్ స్త్రీల హత్యల విషయంలో కూడా నెంబర్ వన్ అవునోకాదో తెలియదుకాని 2002 సంవత్సరంలో జరిగిన 2367 హత్యల్లో 1619 స్త్రీలే. ఇది 2002 నవంబరు నాటి వరకు లెక్కలు.

**2000-2001, 20002 (నవంబరు వరకూ స్త్రీలపై జరిగిన నేరాల వివరాలు)**

| | 2000 | 20001 | 2002 (నవంబర్ వరకు) |
|---|---|---|---|
| వరకట్న హత్యలు | 84 | 96 | 91 |
| వరకట్న మరణాలు | 450 | 406 | 395 |
| ఆత్మహత్యాప్రేరేపణ | 1007 | 948 | 879 |
| వేధింపులు | 5107 | 5765 | 6448 |
| హత్యలు | 572 | 419 | 254 |
| వరకట్ననిషేధ చట్టం | 442 | 413 | 710 |
| రేప్ కేసులు | 893 | 812 | 889 |
| అపహరణలు | 753 | 745 | 830 |
| అసభ్యప్రవర్తన | 3147 | 3382 | 3380 |
| బహుభార్యాత్వం | 606 | 509 | 464 |
| | 13061 | 13945 | 14342 |

ఈ దామాషాన ఆ సంవత్సరంలో జరిగిన హత్యల్లో స్త్రీల సంఖ్య 75 శాతం వుంటుంది. ఎక్కువ హత్యలు విజయవాడ, రంగారెడ్డి, గుంటూరు జిల్లాల్లో జరిగాయి. తెలంగాణాలో కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో ఎక్కువ నేరాలు జరిగాయి.

ఇన్ని చేసినా కుటుంబ హింస తప్పడం లేదు. 'జాతీయ కుటుంబ ఆరోగ్యం' జాతీయ సర్వేలో కట్నకానుకలు తేలేదని, అత్తమామలను గౌరవించలేదని, చెప్పకుండా బయటకువెళ్ళిందని, ఇల్లు పిల్లలను నిర్లక్ష్యం చేసిందని, అనుమానంతో కన్నా వంట సరిగా చేయలేదన్న నెపంతో గృహ హింసలకు గురువుతోందని తెలిసింది. అదే ప్రధాన కారణమని 80 శాతం మహిళలు పేర్కొన్నారు. గృహ హింసలో రాష్ట్రానిది మొదటిస్థానం (సర్వేలో). సతి వున్న రాజస్థాన్‌లో కన్నా మన రాష్ట్రంలో మహిళల్లో మానవ హక్కులు వర్తించడం లేదని సర్వే పేర్కొంది. అదండీ మన అభివృద్ధి. వీటికి ప్రధాన కారణం స్త్రీ అంటే నిరసన, చిన్న చూపు, తేలికభావం. నూతన ఆర్థిక విధానాలు, మతోన్మాదం, వివక్ష, హింస..... సాధికారత ఇంకెక్కడ? కరవు పరిస్థితులు, ఆడ పిల్లల విక్రయాలు, కరవు జిల్లాల్లో వ్యభిచార వృత్తికి తరలుతున్న యువతులు, ఆకలి చావులు, స్త్రీలపై పెరిగిన అత్యాచారాలు మహిళల పరిస్థితికి దర్పణాలు.

❐

# డిస్కౌంటు రేటుకు ఇంజనీరింగ్ సీట్లు

- కె. నరోత్తమరెడ్డి

పాశ్చాత్య సానుకూల నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ రూపుదిద్దుకోవడంతో ఏర్పడిన స్వేచ్ఛా మార్కెట్ విధానం వలన ప్రపంచ వ్యాప్తంగా శాస్త్రసాంకేతిక రంగాల నుండి ఎక్కువ సేవలను ఆశించడం జరుగుతోంది. ఆర్థికాభివృద్ధిని వేగిరపరచడానికి అనుసరించే పద్ధతుల్లో వినూత్న పోకడలు కనిపిస్తున్నాయి. ఇందులో సాంకేతిక పరిజ్ఞానానికి ప్రధాన పీట వేయడం జరుగుతోంది. ఈ మార్పులకనుగుణంగా కాబోలు మనదేశంలో వివిధ రాష్ట్రాలు ప్రత్యేకించి మన రాష్ట్రం సాంకేతిక విద్యాభివృద్ధిని శీఘ్రగతిన అభివృద్ధి పరచడానికి ఇంజనీరింగ్ కాలేజీలను కుప్పలు, తెప్పలుగా ప్రయివేటు రంగంలో స్థాపించడం జరుగుతోంది. గత ఆరు సంవత్సరాలుగా ఈ ప్రక్రియ నిర్విరామంగా కొనసాగుతూ 60 వేలకు పైగా సీట్లతో 217 కాలేజీలు ఏర్పడ్డాయి. ఇంకో కొన్ని కాలేజీలు రాబోతున్నాయి. ఒకప్పుడు ఇంజనీరింగ్ అనేది ఎంతో కష్టసాధ్యమైనదైతే, అదియిప్పుడు అతి సునాయాసంగా అందుబాటులోనికొచ్చింది. కానీ ఈ ప్రయత్నం వలన మనం నిజంగా సాంకేతిక విద్యను పెంపొందిస్తున్నామా లేక ఆ పేరుమీద యువతరాన్ని దిశలేని త్రిశంకు స్వర్గంలోలో ముంచుతున్నామా అన్న అనుమానం రాకమానదు. ఎందుకంటే వాస్తవాలు అలాంటి వాతావరణాన్ని తెలియచేస్తున్నాయి కనుక.

అసలు సాంకేతిక విద్యకు, సాధారణ విద్యకు తేడా ఏమిటంటే క్లాసు రూము పాఠాలతోపాటు అనుభవపూర్వకంగా విద్యనభ్యసించడం, ఆచరణాత్మకంగా పరిశ్రమలలో వుంటూ కొంతకాలం విద్యనభ్యసించడం, తద్వారా ఇంజనీరింగ్ విద్య వాస్తవానికి దగ్గర అవుతుంది. ఆయా పరిశ్రమలు, వివిధ సంబంధిత రంగాలెందుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి తోడ్పడడంతోపాటు సృజనాత్మకమైన, నూతన కల్పనకు దారితీయాలి. ఫలితంగా మానవ వనరుల నైపుణ్యాన్ని పెంచుకోవడం, ఉత్తమ సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధికి దోహదపడడం. మారుతున్న ప్రపంచంలో ఉత్పత్తి, సేవా రంగాల్లో ప్రమాణాలు అత్యున్నత స్థాయికి చేరుతున్నాయి. ఈ స్థితిలో అసమానమైన నైపుణ్యాన్ని ప్రదర్శించాల్సిన అవసరం పెరుగుతోంది. మనదేశం మానవ వనరులలో సూపర్ పవర్‌గా ఎదుగుతుందంటున్నాం. నేటి సాంకేతిక నిపుణులు, ఇంజనీర్లు బహుముఖ ప్రజ్ఞాశాలురు వుండాలన్నమాట. కానీ వాస్తవంగా అలాంటి సాంకేతిక విద్యను మన యువతరానికందిస్తున్నామా!

అలాంటి విద్యను అందించాలంటే కాలేజీలలో ఉత్తమమైన, అనుభవంతో కూడిన బోధనా సిబ్బంది వుండాలి. ఉన్నత ప్రమాణాలతో కూడిన సాంకేతిక పరికరాలు, ల్యాబ్స్, సౌకర్యాలుండాలి. వీటితోపాటు విద్యార్థులకు తగిన ప్రాక్టికల్ ట్రెయినింగ్ ఇవ్వటానికి తగినన్ని పరిశ్రమలుండాలి. వారికి ప్రేరణను కల్పించే ప్రాజెక్ట్ ఆయా పరిశ్రమలలో వుండాలి. అలాగే పరిశ్రమల అవసరాలను తీర్చగలిగే స్థితిలో కాలేజీలుండాలి. వీటన్నింటికీ మించి అత్యున్నతమైన సాంకేతిక విద్యను సమాజానికందించాలనే ఉన్నత ఆశయాలు కలిగిన కాలేజీ యాజమాన్యం వుండాలి.

ఈ మధ్యకాలంలో స్థాపించిన అన్ని ఇంజనీరింగ్ కాలేజీలలో, మెకానికల్, ప్రొడక్షన్, సివిల్ ఇంజనీరింగ్ కోర్సులు లేనేలేవు. అలాంటప్పుడు అవి ఇంజనీరింగ్ కాలేజీలు ఎలా అవుతాయి? నగరంలోనూ, ప్రధాన పట్టణాలలో వున్న కంప్యూటర్ సెంటర్లకు, ఈ కాలేజీలకూ వున్న తేడా ఏమిటి?

అమెరికాలాంటి అభివృద్ధి చెందిన దేశాలలో కంప్యూటర్ ఆధారిత ఉపాధి అవకాశాలు ఇతోధికంగా వున్నాయని సాంకేతిక విద్యను ప్రైవేటురంగం చేసి, యువతలో అపోహను కలిగించి వారి దృష్టిని అటువైపు మళ్ళించి అన్ని ఇంజనీరింగ్ కాలేజీలలో సంబంధిత కోర్సులను ప్రారంభించడానికి ప్రోత్సహించడం జరిగింది. కానీ యువత కలలు కల్లలని అతి కొద్దికాలంలోనే తేలి పోయింది. ఇప్పుడు ఈ కార్యక్రమంలో విద్యార్థులు చేరకపోగా, సీట్లు డిస్కౌంట్ రేట్లలో అమ్మకానికున్నాయి.

ఇంజనీరింగ్ విద్యను పెంపొందించే నెపంతో ప్రైవేట్ రంగాన్ని ప్రభుత్వం ప్రోత్సహించడంతో ఈ విద్యను ధనార్జనకుపయోగపడే సాధనంగా ఎంచుకొన్న యాజమాన్యాలే ఎక్కువ కాలేజీలలో మనకు కనిపిస్తాయి. ఎన్.ఆర్.ఐ. సీట్ల రూపంలోనో, మరేదో మార్గం ద్వారానో లాభపడవచ్చున్న ఆశతో కాలేజీలు స్థాపించినవారే ఎక్కువ. సేవాదృక్పథంపోయి, వయబులిటీ ఆధారంగా ఆలోచించే యాజమాన్యాలు ఎక్కువగా వున్నాయి.

కాలేజీ స్థాపనకు అనుమతినిచ్చేందుకు వున్న "ఏజన్సీలు" నిరంతరం తనిఖీచేసి, అనుమతి కోరిన అన్ని సంస్థలకు అనుమతినిస్తున్నారు. కానీ అందరికీ తెలుసు కనీస వసతులు లేవని, బోధనాసిబ్బంది అసలు లేదని, కానీ అనుమతి మాత్రం అందరికీ ఇవ్వడం జరుగుతోంది. కానీ ప్రతి సంవత్సరం సంబంధిత అధికారులు యాజమాన్యాలను హెచ్చరిస్తూ వుంటారు సౌకర్యాలు లేకుంటే అనుమతిని రద్దు చేస్తామని. ఈతంతు ఇలా కొనసాగుతూనే వుంటుంది. నూతన కాలేజీల అనుమతి యాజమాన్యం యొక్క ఉన్నత దృక్పథం, వీరికి పరిశ్రమలతో వున్న అనుభంధం, కాలేజీల నడపడంలో తగిన పరిజ్ఞానాన్ని చూడకుండా, ఆర్థిక బలము, రాజకీయ అండదండలే అనుమతికి ప్రధాన క్రైటీరియాగా వున్నట్లు ఎక్కువ సందర్భాలలో మనకు కన్పిస్తున్నది.

అనేక కాలేజీలలో కనీస బోధనా సిబ్బంది లేదు. ప్రాక్టికల్ చెయ్యడానికి తగిన ల్యాబ్స్ లేవు. కనీస పరికరాలు లేవు. విద్యార్థులకు కావలసిన

(తరువాయి 22 పేజీలో)

# ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ వార్షిక సభలు

- వకుళాభరణం రామకృష్ణ

1976లో స్థాపించబడిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్, 27వ వార్షిక సభలు, ఈనెల జనవరి 4,5 తేదీల్లో, శ్రీ వెంకటేశ్వర విద్యాలయం, చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాఖల ఆధ్వర్యంలో తిరుపతిలో జరిగాయి. ఆచార్య శంకరనారాయణన్ యీ సంవత్సరపు జనరల్ ప్రెసిడెంట్‌గా, అధ్యక్షోపన్యాసం ఇచ్చారు. ఆంధ్రుల చరిత్ర రచనలో, తొలియుగాలనాటి ముఖ్యమైన చారిత్రక ఆధారాలను, శాసనాల గురించి ప్రస్తావించారు. యిటీవల, పురావస్తు త్రవ్వకాల్లో బయల్పడుతున్న, కొత్త ఆధారాల నుండి లభించే సమాచారాన్ని, ముఖ్యంగా వర్ధమాన చరిత్రకారులు వుపయోగించుకోవాల్సిన అవసరాన్ని వక్కాణించారు. ప్రారంభసభకు ముఖ్య అతిథిగా వచ్చిన వెంకటేశ్వర విద్యాలయం వైస్ ఛాన్సలర్, చరిత్ర అధ్యయనం, పరిశోధనల ప్రాముఖ్యాన్ని వివరించారు. చరిత్ర అధ్యయనం పట్ల పాలక వర్గాల నుండి వ్యక్తమవుతున్న నిరాదరణను నిరసిస్తూ సభలో పాల్గొన్న వక్తలు, చరిత్ర సమస్త మానవ విజ్ఞానానికి మూల సింధువుగా పేర్కొన్నారు. ఇటీవలి కాలంలో, దేశంలో చోటు చేసుకుంటున్న అనేక వేగవంతమైన మార్పులకు, చరిత్ర పఠనం, పరిశోధన సక్రమమైన దిశానిర్దేశం చేస్తుందన్న, చేయాలన్న అశాభావాన్ని వెల్లడించారు.

రెండు రోజులపాటు జరిగిన సభలు, ప్రాచీన, మధ్య, ఆధునిక చరిత్ర రచన, స్థానిక చరిత్ర విభాగాలుగా విడిపోయి, యీ యుగాల్లోని చారిత్రకాంశాలకు సంబంధించిన పరిశోధనా పత్రాలు, నూటికిపైగా చర్చించబడ్డాయి. ఒక్కో విభాగానికి, నిష్ణాతులై చరిత్రకారులు అధ్యక్షత వహించి, తమ తమ ప్రత్యేక పరిశోధనా రంగాల్లో, యిటీవల వస్తున్న అంశాలను, ధోరణుల గూర్చి ఉపన్యసించారు. ప్రాచీన విభాగం బౌద్ధమతానికి ఆంధ్రప్రదేశ్‌లో వున్న పురావస్తు ఆధారాలు, వాటి ప్రాముఖ్యం, వివరాలను అధ్యక్షులు విశ్లేషించారు. ఆధునిక విభాగంలో, ఆంధ్రప్రదేశ్‌లో 19వ శతాబ్దం నుండి దళిత-బహుజనుల 'కింది' కులాలని చెప్పబడే వాటిలో వచ్చిన చైతన్యాన్ని, మిషనరీల కార్యకలాపాలకు ముచ్చటించడం జరిగింది. చరిత్ర రచన విభాగంలో, ప్రసిద్ధ చరిత్రకారులు, హాబ్స్వామ్, బర్టన్ స్టెయిన్, జాన్‌కేయీ అవలంబించిన పద్ధతులను, వారి రచనల్లోని సూక్ష్మాంశాలను విశ్లేషిస్తూ, వాటిని నేటి చరిత్ర రచనకు ఎలా మలచుకోవాలో వివరించారు.

ఆంధ్రప్రదేశ్ చరిత్ర క్రమంలో వివిధ రంగాల్లోని చారిత్రకాంశాలపై సమర్పించిన పరిశోధనా పత్రాలు, రాజకీయ చరిత్ర కంటె, ఆర్థిక, సామాజిక, సాంస్కృతికాంశాలపై దృష్టి స్పష్టంగా వెల్లడయింది.

స్థానిక చరిత్ర విభాగంలో తిరుపతి పట్టణ పూర్వాపరాలు, తిరుమల దేవాలయం చరిత్ర గమనంలో మార్పులకు లోనవుతూ, క్రమాభివృద్ధి చెందిన తీరు చర్చించడంతోపాటు, చిత్తూరుజిల్లాలోని చారిత్రకాంశాలను యీ పత్రాలు వివరించాయి. ఆధునిక విభాగంలో, ఆదివాసీ స్త్రీల జీవన విధానం, వారి సాంస్కృతిక జీవనంలో చోటుచేసుకుంటున్న మార్పులు, నేరస్త జాతులు, వారి పుట్టుపూర్వోత్తరాలు, వారిలో వస్తున్న పరిణామం, దేవదాసి నిషేధ చట్టంపై ఆనాడు మద్రాసు రాజధానిలో జరిగిన వాదోపవాదాల్లోని విభిన్న భావధోరణులు, గురజాడపై బెంగాలీ మేధావులు, ప్రత్యేకించి శంభు ప్రసాద్ ముఖర్జీ ప్రభావం, తెలుగు చలన చిత్ర రంగంలో, 1940 దశకం నుండి అవలంబించబడుతూ వచ్చిన సెన్సార్ విధానం లాంటి మరెన్నో అంశాలు చర్చకొచ్చాయి. రాసిలో పరిశోధనా పత్రాలు గణనీయంగానే వున్నా, వాసిలో అవి మరింత ప్రమాణాల్ని సంతరించుకోవాలన్న అభిప్రాయం వ్యక్తమైంది. ఈ పరిశోధనా పత్రాలు నేడు విశ్వవిద్యాలయాల్లోనూ, వాటి వెలుపలా జరుగుతున్న పరిశోధనా ప్రమాణాలను ఒక విధంగా సూచికలుగా చెప్పుకోవచ్చు. చరిత్ర అధ్యయనంపై ఎప్పుడైతే నీలినీడలు పడ్డాయో, గత మూడు, నాలుగు సంవత్సరాల నుండి చరిత్రను అధ్యయనం చేసే విద్యార్థుల సంఖ్యతోపాటు, పరిశోధనారంగం కూడ అదే క్రమంలో కుంటుపడింది. పరిశోధనా ప్రమాణాలు తగ్గడానికి దీన్ని సాకుగా తీసుకోవడం సరియైన దృక్పథం కాదని అంగీకరిస్తూ, ప్రస్తుతం సామాజిక శాస్త్రాలకు సంబంధించి నెలకొన్న స్తబ్ధత తాత్కాలికమేనని, ఇది త్వరలోనే తొలగిపోతుందని ఆశిస్తూ, పరిశోధనా పర్యవేక్షకులు, ప్రమాణాలకు పెంపొందించడానికి కృషి సల్పాలని, సభల్లో పాల్గొన్న ప్రతినిధులు అభిప్రాయపడ్డారు.

ఆంధ్రప్రదేశ్‌లోని చరిత్రకారులకు, అధ్యాపకులకు, పరిశోధక విద్యార్థులకు, చరిత్రలో ఆసక్తి వున్న జిజ్ఞాసువుకు వేదికగా, పరస్పరం చర్చించుకొని, భావాలను కలబోసుకునే ఒక వేదికగా రూపొందిన, ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్, గతంలోలాగే, యీ సంవత్సరం, పోయిన సారి జరిగిన వార్షిక సభల పరిశోధనా పత్రాలను ఎంపిక చేసి ఒక సంపుటిగా ప్రచురించి, యిక్కడ సభ్యులకు అందచేసింది. ఇప్పటికి 26 ప్రొసీడింగ్స్ సంపుటాలుగా వెలువడ్డాయి.

యీసభలకు నిండుదనం చేకూర్చిన ముఖ్యఘటన, ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర - సంస్కృతికి సంబంధించిన మొదటి సంపుటాన్ని ఆవిష్కరించడం. ఇది చరిత్ర పూర్వయుగానికి చెందిన (క్రీ.పూ.500 వరకూ) విషయ వివరణకు చెందిన సంపుటం. ఆదిమ కాలంలో, మానవుల నివాసాలు, వారి పనిముట్లు, వుత్పత్తి విధానం, జీవనశైలి, పురావస్తు త్రవ్వకాల్లో బయల్పడ్డ అప్పటి అవశేషాలు కొండ గుహల్లో, ఆదిమమానవుడు సృష్టించిన చిత్ర కళల గూర్చి, 11 పటాలు, నలభైకి పైగా ఫోటోలు, పట్టుదలతో సమగ్రంగా తయారు చేయబడిన గ్రంథం యిది. గత నలభైయేళ్ళుగా, ఆలోచనలో వుంటూ, కార్యరూపం ధరించని, యీ బృహత్తర ప్రాజెక్టును ఆంధ్ర ప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ చేపట్టింది. 8 సంపుటాల్లో వర్తమాన యుగం వరకూ, ఆంధ్రుల చరిత్రను ఆంగ్లం, తెలుగు భాషల్లో రచించి, వెలువరించాలన్న స్వప్నానికి యీ సంపుటం తొలిమెట్టు.

# ప్రపంచ పరాన్నభుక్కులు

ఇది పుస్తక సమీక్ష కాదు. పరిచయం మాత్రమే. పుస్తకంలో వున్న ముందుమాట ఆ పని చేస్తుంది. ముందు మాటనే మీ ముందుంచుతున్నాం. మన దేశమే కాక 2/3 వంతు ప్రపంచం ఎదుర్కొంటున్న విషయ పరిస్థితుల వెనుకనున్న ఐదువందల సంవత్సరాల పాశ్చాత్య సమాజపు పరాన్నభుక్కు జీవన విధానాన్ని, దాన్ని అన్యాక్రాంత దోపిడీ, పీడనలను, వలస విధానాన్ని, ప్రపంచీకరణ విధానాలను వ్యాఖ్యాన రూపంలో ఈ పుస్తకంలో వివరించారు.

ఈ పుస్తకానికి రచయితల ముందుమాట చాలా ఉద్వేగభరితమైన, నిజాయితీతో కూడుకొన్న నిష్పక్ష పాత విమర్శ. ఈ ముందు మాటను పాఠకులకు పరిచయం చేస్తే ఆ పుస్తకాన్ని క్లుప్తంగా పరిచయం చేయడమే కాక, ఆ పుస్తక సారం కూడా వారి ముందు వుంచినట్లవుతుందనే ఉద్దేశ్యంతో అనువదించి ప్రచురిస్తున్నాం.

ముందుమాట

కొన్ని రకాల రంగు రంగుల కందరీగల జాతులు, గొంగళి పురుగులు, సాలీళ్ళవంటి బతికున్న జీవాల అవయవాల పై భాగాలలో గాలి, లోపలి భాగాలలో గాని గుడ్లు పెడతాయి. అట్లా గుడ్లు పెడుతూనే వాటి బారిన పడిన కీటకాలలోనికి ఓ విష పదార్థాన్ని ఎక్కిస్తుంటాయి. ఇలా చేయడం ద్వారా తమ వాతపడ్డ కీటకాలను చావు-బతుకుల మధ్య వుంచుతూ నిర్వీర్యం చేసేస్తాయి. బాధిత కీటకాలపై పెట్టినగుడ్లు లార్వాగా బైట పడి కీటకాల ప్రధాన జీవనాంగాలైన గుండె, నాడీ మండలం మొదలైన వాటిని భక్షించకుండా ఇతర శరీర భాగాలయిన కొవ్వు జీర్ణకోశ అవయవాలను భుజిస్తూ వుంటాయి. తమ స్వపోషణార్థం ఈ కందిరీగలు సాధ్యమయినంత కాలం తమ బాధిత జీవులనుండి తమకు లభిస్తున్న ఆహారాన్ని సముచితంగా అనుభవిస్తూ తాజాగా లభ్యమౌతుండేటట్లు చూసుకొంటాయి.

ఇటువంటి భయానక ప్రవర్తన కేవలం నికృష్ట జీవరాసులకే పరిమితమని మనల్ని మనం ఓదార్చుకోవడానికి ప్రయత్నించవచ్చు. కాని అటువంటి సమాంతరమైన భయానక ప్రవృత్తే మానవుల్లో మానవులే కొనసాగిస్తారు. ఇటువంటి పద్ధతిని కొన్ని మానవ జాతులు ఇతర మానవ సమూహాలపై ప్రయోగించి తమపబ్బం గడుపుకోవడాన్ని ఉన్నతంగా తీర్చి దిద్దుకోవడంలో ప్రావీణ్యత సంపాదించుకున్నారు. పాశ్చాత్య సమాజం తమ జీవన విధానమే, తమ సంస్కృతే సార్వజనీనమైనదని అది మినహా ఏ మార్గాంతరం లేదని నమ్మబలుకుతూ అటువంటి ఆలోచనా విషాన్ని తమ బాధిత ప్రజల మస్తిష్కాల్లోకి ఎక్కించి వాటిని మేధోపరంగా నిర్వీర్యపరచి తమ పబ్బం గడుపుకొంటుంది. తమ బాధిత జాతులనుండి తమ అడుపాజ్ఞల్లో, తమ మార్గంలో తు.చ. తప్పక నడిచే ఓ శిష్ట మార్గాన్ని పెంచిపోషిస్తుంది. అటువంటి వర్గం కూడా స్వజాతి మానవులపై జీవిస్తూ తమ యాజమాన్య వర్గమైన పాశ్చాత్య సంస్కృతికి కాపలా కాస్తూ వుంటుంది. దురాక్రమణ దారులు, దోపిడీ సాహసుల ముందు ఆనాడు తెరచుకొన్న అవకాశాలు, వారు జయించబోయే విస్తృత సంపద మూల్యం ఈ రోజు మనం లెక్కకట్టడం సాధ్యంకాదు. అటువంటి దుశ్చర్యలకు పరిమితులుంటాయనే విషయం వారికి తట్టలేదు. తాము అవలంబించే అన్యాయ ప్రవృత్తి వారి మనో నిబ్బరాన్ని ఏరకంగానూ, భంగపరచలేదు. పాశ్చాత్య పారిశ్రామికీకరణ - శాస్త్ర విజ్ఞానము వారి వలసవాద దోపిడీ విస్తృతి అన్యాయ ప్రవృత్తులతో చెట్టాపట్టాలేసుకొని మరింత సమర్థంగా కొనసాగింది.

పాశ్చాత్య సమాజ సంస్కృతిలో అంతర్భాగమైన, అంతర్లీనమైన ఈ పరాన్నజీవన ఆలోచనా సరళి, సుదూరప్రాంతాల ఆక్రమణ, సంపద పోగొచేసుకోవడం నిరంతరం సాగించుకోవచ్చనే వారు అనుకొన్నారు. దానికి పరిమితిలుంటాయని ఊహించలేదు. ఆ స్పృహ కూడా వారు అలవరుచుకోలేదు.

ఇతరులు మానవ హక్కులు ఉల్లంఘిస్తున్నారని, జనాభాను నియంత్రించటం లేదని, అవినీతిలోనూ, నిర్వహణా రాహిత్యంతోనూ ఉన్నారని నిందారోపణలు చేస్తూ ఈనాటి పాశ్చాత్య సమాజం తానొక నీతివంతమైన ఉన్నత స్థానంలో ఉన్నట్లుగా భావించుకొంటుంది. ఈ సమాజం ఇప్పుడున్న దశకు చేరడానికి చెప్పనలవికాని అవినీతికర, అమానుష కార్యక్రమాలు కొనసాగించింది. అతి హింసాత్మకమైన, జుగుప్సాకరమైన, దారుణమైన, హేయమైన మానవ హక్కుల ఉల్లంగనకు, మానవాళి ఊచకోతకు, బానిసత్వానికి, వలస వాదానికి నిస్సిగ్గుగా ఉపక్రమించింది. వారు దురాక్రమించే ప్రాంతాల విస్తృత దోపిడీ కొనసాగించక పోయినట్లయితే వారి పారిశ్రామిక విప్లవం పైకెగసే లోపే కుప్పకూలి పోయేది. విస్తృత, విస్మయ పాశ్చాత్య సంపదాసౌధం అన్యాయం - అభద్రత - నిలకడలేనితనం అనే ఇసుక పునాదులపై నిర్మించబడిందనే వాస్తవాన్ని మనం గుర్తించాలి.

ఏ సమాజమైనా విశ్వ వ్యాపితంగా గుర్తించబడి అంగీకారం పొందాలంటే ముందుగా అది సహజంగానూ, న్యాయబద్ధమైనదిగాను వుండాలి. తను తనకోసం ఎటువంటి సౌకర్యాలు, లాభాలు వనరులు ఉండాలని కోరుకుంటుందో అటువంటివే తదితర ప్రపంచ మానవాళికంతకు కావాలని కోరుకోవాలి. అంతేకాక అటువంటివన్నీ ప్రపంచ మానవాళికి నాలుగు కాలాలపాటు ఏర్పాటు చేయగల సత్తా కూడా దానికి ఉండాలి. అయితే ప్రధానమైన ప్రశ్న ఏమంటే - ప్రపంచంలో వున్న మానవాళి యావత్తు పాశ్చాత్య సమాజం లాగానే అతి వినియోగ పంథాలో సంపదలు అనుభవిస్తూ గడిపే పరిస్థితి వుందా? అలాగయితే ఈ భూగోళంలో పునఃసృష్టి కాని త్వరితంగా తరిగిపోయే వనరులు, సంపదల సంగతేమిటి? విస్తృత వస్తు వినియోగ సంస్కృతి వల్ల పోగయ్యే వ్యర్థ పదార్థాలు, పర్యావరణ కాలుష్యం మాటేమిటి? పాశ్చాత్య సంస్కృతిని, జీవన సరళిని పెద్దగా నెత్తినెత్తుకున్న వారి సమర్థకులైనా అటువంటి సంతోషదాయకమైన పరిస్థితి వుండదనే విషయాన్ని ఒప్పుకుంటారు. ఇప్పుడు పాశ్చాత్య సమాజం ప్రవచించే నీతులు, కార్యక్రమం నిరాటంకంగా ఆచరిస్తూ పోవాలంటే ఇప్పటికే దరిద్ర బాధితులైన మానవాళి ఇంకెంత దరిద్రాన్ని, ఇంకెంత హీనస్థితిని చవిచూడాలో ఆ నీతిమంతుల్ని నిలదీసి లెక్క చెప్పమంటే వారివద్ద జవాబు దొరకదు. వారి వద్ద ప్రత్యామ్నాయాలూ లేవు.

సుస్థిరమైన అనే పదాన్ని పాశ్చాత్య సమాజం ఇప్పుడు ఆతృతతో

కౌగలించుకొంది. సొంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. ఇలా చేయడంలో ఆ పదానికి అర్థాన్ని పూర్తిగా తారుమారు చేసింది. వారికి అనుకూలంగా మలచుకొంది. వారెక్కడైతే తమ పట్టు కలిగి వున్నారో దానిని నిలబెట్టుకోవటంలో భాగంగానే ఈ పదానికి నిర్వచనం చెబుతుంది. వారి ఈ వక్రీకరణకు మనం పెద్దగా ఆశ్చర్య పడనక్కర్లేదు. ఎందుకనంటే కొన్ని వందల సంవత్సరాల తరబడి కొనసాగిస్తున్న ఆక్రమణలు, సంపద దోపిడీలు, వలసలలో వారు సృష్టించిన బీభత్సంలో పోలిస్తే ఈ భాషా వలసీకరణ అనేది వారికి ఓ చిన్నపాటి ఆటే.

వలసాధిపతులుగా ఆనాడు పాశ్చాత్య సమాజం వృద్ధి పరచిన విలువలు ఈనాటికి కూడా మారకుండా స్థిరంగానే వున్నాయి. ఇదివరకటిలా ఇప్పుడు బయటకు కనపడేటట్లు భౌతిక దురాక్రమణను, దోపిడిని కొనసాగించలేని పరిస్థితుల్లో 2/3 వంతు ప్రపంచం నుండి సంపదను పాశ్చాత్యదేశాలకు బదలాయింపు చేసే విస్తృతమైన సరికొత్త ఆర్థిక విధానాలను ఆవిష్కరించి అమలు చేస్తూనే వుంది.

పాశ్చాత్య సమాజం చెపుతున్న ఈనాటి నూతన ధర్మ పన్నాలు, దాని నాటకీయ పరిణామం తన పెత్తన చెలామణీకి ఇంకో రూపం మాత్రమే. చాలా ఖరీదైన, బహిరంగంగా అందరి దృష్టిలో పడే యుద్ధ సరంజామానుపయోగించి దోచుకునే పద్ధతికి బదులుగా మరింత విస్తృతితో కూడిన, కనిపించని ఆర్థిక పరమైన శక్తి యుక్తుల దోపిడీ వాహనాన్ని అది ఎంచుకొంది. తెలివిగా ఇతర ప్రపంచాన్ని లోబరుచుకొన్న అన్యాయపు చట్రాలను విప్పి వేయడానికి బదులు ఆ దోపిడీ పద్ధతులనే మరింత విస్తృతంగా ఆర్థికాభివృద్ధి సూత్రాల ముసుగులో పవిత్రీకరించి ప్రతిష్ఠించింది.

అమెరికా మాజీ అధ్యక్షుడు బుష్ (ఇప్పటి ప్రెసిడెంటు బుష్ తండ్రి) నీతిమంతమైన, న్యాబద్ధమైన నూతన ప్రపంచ వ్యవస్థ ఈ భూమిపై రూపుదిద్దుకోవాలని ప్రకటించాడు. ఇప్పుడు ఈ రకమైన న్యాయబద్ధమైన శాంతియుతమైన ప్రపంచాన్ని కోరుకొంటున్న వారిని నిలదీసి మనం ప్రశ్నించాల్సి వుంది - ఇప్పటివరకు కొనసాగుతూ వచ్చిన అన్యాయమైన, నీతి బాహ్యమైన వ్యవస్థకు ఎవరు కారకులు? దానిని ఎవరు నిర్ణయించారు? వారి ఆర్భాటపు హృదయం పరివర్తనుంచి రెండు విషయాలను రాబట్టవచ్చు. ఒకటి, వారు వాంఛించే నూతన ప్రపంచ వ్యవస్థ సర్వ అవలక్షణాలను, పోలికలను కలిగి వుంటుంది. రెండు, ఇతర ప్రపంచంలో ఎవరూ కూడా తను అపరిమితంగా సంపదను పోగుచేసుకున్న కాలంలో తాను ప్రయోగించిన యుద్ధం-హింసలకు ఇతరులు పాల్పడవద్దని, వాటికి దూరంగా వుండమని చెప్పే కపట ప్రకటన. 2/3 వంతు ప్రపంచానికి ఇచ్చే ఉచిత సలహాలు, ఆజ్ఞలు ఎలా వుంటాయంటే పాశ్చాత్యులు మినహా ఏ ఇతర దేశం తమను ఆ విషయాల్లో అనుకరించకూడదనే పట్టుదల కలిగి వుంటుంది. ఆ హక్కు వారికే వుండాలి. మరెవరికీ వుండకూడదు అని వారి వాదన. పాశ్చాత్య ప్రపంచం లాగానే అభివృద్ధి చెందాలనుకుంటే మిగతా వారికున్న ఏకైక మార్గం ఏమంటే వారు కూడా పాశ్చాత్యుల వలెనే నిర్దయగానూ, దోపిడీదారుగా వ్యవహరించటమే! అలా చేయడానికి, దోచుకోవడానికి కొత్తగా కనుగొనడానికి భూభాగాలు మిగలలేదు. వాటిని జయించి వలసలు ఏర్పాటు చేసుకోవడానికి ఒకవేళ అట్లా ఏమన్నా మిగిలివుంటే ఇతరులు ఆ పనికి ఒడంబడితే అటువంటి పనిలో ఇదివరకే లబ్దిదారులైన పాశ్చాత్య సమాజం ఈ రకమైన దోపిడీ అనుకరణ అన్యాయమని, అసంబద్ధమని, అమానుషమని, శిక్షార్హమని తనే ముందు అడ్డుకొంటుంది.

పాశ్చాత్య సమాజంలోనే హింసా, అన్యాయం వున్నాయి. కాని ఈ విషయంలో ఇతరులకన్నా పాశ్చాత్యులే మరింత దారుణంగా ప్రవర్తిస్తున్నారని చెప్పడం మా అభిప్రాయం కాదు. దురాస, దోపిడీ అన్నది పాశ్చాత్యులే కనుగొన్నారని కాని అవి ఇతరులకు తెలియనివని కాని మేము అనడం లేదు. ధన-కనక దాహము, అధికార వాంఛ బలమే నిజమనే నమ్మిక పాశ్చాత్యులవలె ఇతర సమాజాలకు కూడా ప్రోత్సాహకాలుగా వున్నాయనేది నిజమైనప్పటికీ పాశ్చాత్య సమాజం మినహా ఏ ఇతర సమాజం అన్యాయాన్ని, దోపిడీని, క్రమపద్ధీకరించి ఉన్నత దశకు తీసుకొనిపోయి సవిస్తరమైన, నైపుణ్యంతో కూడిన కళగా మార్చి తమ అభీష్టాలను మొత్తం భూ మండలాలపై రుద్దలేదనే నిజాన్ని మటుకు నిర్దుష్టంగా చెప్పవచ్చు. మన మనుగడ సాగించడానికి కాకుండా పాశ్చాత్య సమాజం తనకు తానుగా సృష్టించిన అంధకారంలో నుండి ఓ వెలుగు మార్గాన్ని చూడాలన్నా ముందుగా వారు భౌతికంగానూ, సిద్ధాంతపరంగానూ నిర్మించిన బ్రహ్మాండమైన, బలీయమైన సౌధాన్ని పూర్తిగా వూడదీసి పక్కకు పెట్టాల్సి వుంది. ఆ పాశ్చాత్య పద్ధతులను పూర్తిగా వదిలించుకొనే అవసర రీత్యా మనం వాటిని క్షుణ్ణంగా పరిశీలించాలి. అది చేసిన తప్పులు ఎటువంటివో చూడాలి. వాటిలో ఏమైనా వుపయోగకరమైన, న్యాయమైన, నిలకడైన అంశాలు వున్నాయేమో పరిశీలించాలి. అలాకాని పక్షంలో తప్పక ప్రత్యామ్నాయాలను వెతకవల్సిందే.

పాశ్చాత్య సమాజం ఈనాడు అది చేరుకొన్న దశకు వెనక వున్న చరిత్రను ఈ పుస్తకం పరిశీలిస్తుంది. పాశ్చాత్య నూతన ప్రపంచాన్ని అన్వేషించడంలోనూ, కనుగొనడంలోనూ, మొదట పారిశ్రామిక విప్లవం, ఆ తర్వాత ఈనాడు అది సృష్టించుకొన్న హై టెక్నాలజీ, హై ప్రొడక్టివిటీ ఆధారిత నమూనా సమాజం నిర్మించుకోవడానికి కావల్సిన పెట్టుబడి ఉత్పత్తి, శ్రమ, ముడిసరుకులు పోగుచేసుకోవడం వెనుక వారిని ప్రేరేపించి నడిపించిన విషయాలను విశదీకరిస్తుంది. దీనిలో భాగంగా వారికి అనువైన నీతి నియమాల వ్యవస్థ ఏర్పాటును కూడా పరిశీలిస్తుంది.

మొదటి కొద్ది అధ్యాయాలూ భూ భాగాల ఆక్రమణల ద్వారా నివసించే ప్రజలనుండి, అక్కడి వనరులనుండి పెట్టుబడిని దండుకోవడం ద్వారా అక్కడి ప్రజల అణచివేత పద్ధతులతో వారి శ్రమ దోపిడీ ద్వారా పాశ్చాత్య సమాజం ఏ రకంగా లబ్ధి పొందిందో తెలియ చెప్పుతాయి. వస్త్ర పరిశ్రమ అనే అధ్యాయం ఈ ప్రముఖమైన సరుకు యొక్క చరిత్ర మూలాలకు వెళ్లి దాని ఆధారంగానూ ఆ రంగాన్ని దోపిడీ చేయడం ద్వారానూ పాశ్చాత్య దేశాల్లో వచ్చిన పారిశ్రామిక విప్లవం గూర్చి వివరిస్తుంది. తర్వాత అధ్యాయం పాశ్చాత్య పారిశ్రామిక వ్యవస్థ తనకు ఆదర్శమైన మత్తు మందుల పర్వాన్ని పరిశీలిస్తుంది. తదనంతరం ఈ పాశ్చాత్య సంస్కృతిలో పెనవేసుకొని వున్న విషయాలను దాని డొల్లతనాన్ని వివరిస్తుంది. ఆఖరి మాటలో న్యాయబద్ధమైన, నీతివంతమైన, నిలకడైన ప్రత్యామ్నాయ మార్గాలను ప్రస్తుత సమాజానికి సూచిస్తుంది.

(వినిన్ పెరీరా, జెరెమీ సీబ్రూక్ రచన గ్లోబల్ పారసైట్ -500 యియర్స్ ఆఫ్ వెస్టర్న్ కల్చర్, ముందుమాట అనువాదం: **భూపతిరాజు సాంబశివరాజు**) ❐

# "ఇది మరొక ఇపిడబ్ల్యు కావాలి"

పెట్టుబడిదారుల పాలౌతున్న పత్రికారంగంలో సహకార వ్యవస్థ నెలకొని, జర్నలిస్టుల సహకారంతో పత్రికలు వెలువడాలని తాను ఎన్నాళ్ళ నుంచో ఆశిస్తున్నానని, ఈ నాటికి కార్యరూపంలోకి వచ్చిందని మాజీ రెసిడెంట్ ఎడిటర్ రాజేంద్ర ప్రసాద్ అన్నారు. 2003 జనవరి 1న హైదరాబాద్‌లో 'ప్రజాపక్ష సమీక్ష' పక్ష పత్రిక ఆవిష్కరణ సభలో మాట్లాడుతూ, పరిశ్రమ స్థాయిరూపం పొందిన పత్రికారంగంలో నిబద్ధతకు తిలోదకాలిస్తూ, అవసరార్థం యాజమాన్యాల కనువుగా పాత్రికేయులు రోజులు వెళ్ళ మార్చాల్సి వస్తుందనే ఆవేదనను ఆయన వ్యక్తం చేశారు. ఇందుకు తక్షణ ప్రత్యామ్నాయంగా, పాత్రికేయులే సహకార సంస్థలుగా ఏర్పడి పత్రికలను ప్రారంభించి, 'ప్రజాపక్షం' వహించడం అవసరమని, తాను ఎన్నేళ్ళగానో భావిస్తున్నానని ఆయన తెలిపారు. యిన్నాళ్ళకు సీనియర్ పాత్రికేయులు వి.హనుమంతరావు, తోటి పాత్రికేయులతో కలసి నిబద్ధతకు నిలువుటద్దంలా "ప్రజాపక్ష సమీక్ష" అనే పక్ష పత్రికను ప్రారంభించడం ముదావహం అని ప్రశంసించారు.

ఈ పక్ష పత్రికను ఆవిష్కరించిన ఆంధ్రప్రదేశ్ ప్రెస్ ఎకాడమీ అధ్యక్షులు ఐ.వెంకట్రావ్ మాట్లాడుతూ పత్రికా నిర్వహణలో కష్టాలు తనకు స్వానుభవమేనని చెప్తూ, ఈ కష్టాలనధిగమించే లక్ష్యంతోనే ప్రజాపక్ష సమీక్షను అత్యంత నిరాడంబరంగా రూపొందించడం సంపాదక వర్గ కట్టుబాటుకు నిదర్శనం అన్నారు. పత్రికల యాజమాన్య ప్రయోజనాలు ఏవైనప్పటికీ ప్రజలు ఆశించే వార్తలను కథనాలను రాయకుంటే మనుగడ కష్టమయ్యే పరిస్థితులు నేడున్నాయన్నారు. ప్రత్యేకించి ప్రపంచీకరణ విధానాలు వూపందుకుంటూ ఓ ప్రత్యేక చర్చ జరుగుతున్న నేపథ్యంలో ప్రజా పక్షాన నిలిచి రాసే పత్రికల ఆవశ్యకత వుందనీ, ఆ కొరతను ఈ పక్ష పత్రిక తీరుస్తుందని ఆయన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

ఇండియన్ యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్స్ జాతీయ సెక్రటరీ జనరల్ కె.శ్రీనివాసరెడ్డి మాట్లాడుతూ, సమాజంలో సంస్కరణలు జరిగినపుడే మార్పు అనివార్యమౌతుందనీ అయితే ఈ సంస్కరణలు ప్రజాజీవన మెరుగుదలకు దోహదపడాలనీ అన్నారు. సంస్కరణల బాగోగులను ప్రజాపక్ష సమీక్ష నిర్ద్వంద్వంగా సమీక్షించగలదనే ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకులు కె.రామచంద్రమూర్తి మాటాడుతూ. పెద్ద పత్రికల కన్నా చిన్న పత్రికలే ప్రజా సమస్యల పట్ల చురుగ్గా స్పందించగలవని, అందుకే చిన్న పత్రికలను ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా వుందని అన్నారు. సమస్యలపైన స్పష్టమైన అవగాహన వున్న పాత్రికేయ మిత్రులు నిర్వహిస్తున్న ఈ పక్ష పత్రిక ప్రజల ఆదరాభిమానాలను చూరగొనాలని ఆశించారు.

'వార్త' దినపత్రిక సంపాదకులు టంకశాల అశోక్ మాట్లాడుతూ ఉద్యమాలకు నెలవైన మన రాష్ట్రంలో పాఠకుల చైతన్య స్ఫూర్తికి కొదవలేదనేది తమ స్వానుభవమని చెప్పారు. విషయ ప్రాధాన్యతకు పెద్దపీట వేసే విజ్ఞత మన గ్రామీణ పాఠకులకు సైతం వుందనీ విషయ ప్రాధాన్యతకే ప్రాముఖ్యమిస్తున్న ఈ ప్రజాపక్ష సమీక్ష లాంటి పత్రికను పాఠకులకు అందివ్వ గలిగితే తప్పకుండా ప్రాచుర్యం పొందగలదని, ఆశించినంతటి ప్రాచుర్యం వుండాలని తాను ఆశిస్తున్నానన్నారు.

భారతీయ జనతాపార్టీ అధికార ప్రతినిధి పరకాల ప్రభాకర్ మాటాడుతూ నిబద్ధత లక్ష్యంగా ఈనాటికీ పాత్రికేయ వృత్తికే కట్టుబడి అవిరామంగా శ్రమిస్తున్న సీనియర్ పాత్రికేయులు హనుమంతరావు గారి ప్రయత్నం తప్పక సఫలం కావాలని కోరారు.

ఈ ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన ఈ పత్రిక సలహా మండలి సభ్యులు వకుళాభరణం రామకృష్ణ మాట్లాడుతూ ఏనాడో మహాకవి శ్రీశ్రీ ప్రకటించిన 'పెట్టుబడికి కట్టుకథకు పుట్టిన విష పుత్రికలు ఈ పత్రికలు' అన్న వ్యాఖ్య నేడు నిజమవుతుందన్నారు. స్వాతంత్ర్యం వచ్చి ఏభై ఏళ్ళయినా, నువూరు నగభాగం ప్రజలు అర్థాకలితో అలమటిస్తున్నారనే ఆవేదనను వ్యక్తం చేశారు. ప్రపంచీకరణ నేపథ్యంలో సాంస్కృతీపరంగా వస్తున్న మార్పులను తడుముతూ ప్రజాపక్షాన నిలిచే పత్రికలకు ప్రజలు అండదండలు అందివ్వాలని కోరారు. అందులోనూ పాత్రికేయులే నిర్వహిస్తున్నందున ఈ ప్రజాపక్ష సమీక్షను బతికించుకోవలసిన బాధ్యత పాఠకులదే నని స్పష్టం చేశారు. ఆర్థిక రాజకీయ విశ్లేషణలకు ప్రాముఖ్యత నిచ్చే ఈ తరహా పత్రిక అవసరం నేడు ఎంతైనా వుందని, భవిష్యత్‌లో ఎకనామిక్ పొలిటికల్ వీక్లీ తరహాలో తెలుగులో వెలువడే పత్రికగా ఈ ప్రజాపక్ష సమీక్ష వెలుగొందాలనీ కోరారు. అందుకు ప్రాతిపదికగా సభకు విచ్చేసిన వారంతా ముందు చందాదార్లు కావాలని సభాముఖంగా కోరారు.

సభా ప్రారంభానికి ముందు సంపాదకులు హనుమంతరావు పత్రిక లక్ష్యాన్ని ప్రకటించారు. సభా ముఖంగా, అఖిలభారత కిసాన్ మజ్దూర్ సంఘ్ (ఎ.ఐ.కె.ఎమ్.ఎస్.) రాష్ట్ర శాఖ ప్రధాన కార్యదర్శి గాదె దివాకర్ వంద కాపీలను కొనుగోలు చేసి తమ సంఘీభావాన్ని వ్యక్తం చేశారు. ఆవిష్కరణ సభకు పత్రిక సలహా మండలి సభ్యులు, పాత్రికేయులు డి.పాపారావ్ వందన సమర్పణ చేశారు. పరిమిత ఆహ్వానిత సభ్యుల సమక్షంలో ప్రజాపక్ష సమీక్ష నిరాడంబరంగా పాఠక మిత్రులకు చేరువయ్యింది. యిక దాని ఆలనాపాలనా మీదే మరి....

❐

# జనవరి 1-15, 2003

## రాష్ట్రం

16 ప్రయివేటు ఎయిడెడ్ పాఠశాలలో రిజర్వేషన్లు పాటించనక్కర్లేదన్న ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పుపై సుప్రీం స్టే
ఉత్తరాంధ్ర ఉభయ గోదావరి జిల్లాల్లో రబీ సీజన్‌లో బోర్ల కింద వరిపంట దాదాపు నిషేధం

20 నీటికోసం గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో ఘర్షణ-పోలీసు కాల్పులు
హై కోర్టు తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మోతీలాల్ బి.నాయక్

21 చేరాకు కేంద్ర సాహిత్య అకాడమి పురస్కారం

22 32వ జాతీయ క్రీడోత్సవాలముగింపు

24 కేంద్రం కరువు సాయం రు.174 కోట్లు. విపత్తు నిధి నుంచి వినియోగించుకోవాలి
కేంద్ర మాజీమంత్రి మల్లిఖార్జున్ మృతి
రబీకి క రెంటు ఇవ్వలేం - ట్రాన్స్‌కో
మధ్యాహ్న భోజనంలో అపశ్రుతులు
నాలుగు జాతీయ రికార్డులు సృష్టించిన విశాఖ పోర్టు

25 జయలలితకు బాబు విందు

26 బి.ఇ.డి. అడ్మిషన్లపై రాజీ
మధ్యాహ్నం భోజనం వ్యయం పెంపు. గరిష్ట వ్యయం రెండు రూపాయలు
ఎన్.డి.ఎ. కే మద్దతిస్తాం - టి.ఆర్.ఎస్. ప్రకటన
భానుమతి, హృషీకేష్‌లకు ఎన్టీఆర్ అవార్డులు
జన్మభూమికి రూ.245 కోట్లు కేటాయింపు

28 రాష్ట్రానికి కరువు సహాయం మరో 3.15 లక్షలు

29 పి.ఎం. పదవికన్నా సి.ఎం. పదవే ఇష్టం - బాబు

## దేశం

15 గుజరాత్‌లో బి.జె.పి. గెలుపు
రాజస్తాన్ ఉప ఎన్నికల్లోనూ బి.జె.పి. గెలుపు

16 పార్లమెంటుపై దాడిలో ఆ నలుగురూ దోషులే
ఇటలీకి జారుకున్న ఖత్రోచీ
నాగప్పమృతిపై న్యాయవిచారణ, కర్నాటక నిర్ణయం
ఖవ్వాలీ రాణి షకీలా భానూ కన్నుమూత
కాంపిటీషన్ బిల్లుకు లోక్‌సభ ఆమోదం
ఇండోనేషియా పోలీసు నిర్బంధంలో పొలారిస్ అధినేత, 20న విడుదల
సమాచార స్వేచ్ఛ బిల్లుకు పార్లమెంటు ఆమోదం

19 భారత ప్రధాన న్యాయమూర్తిగా ఖరే ప్రమాణం
ఆర్థికశాఖదే బాధ్యత- స్టాక్‌కుంభకోణంపై జె.పి.సి.
ఆరేళ్ళ గరిష్ట స్థాయి (రు.5560) చేరిన బంగారం ధర
విమాన సంస్థల ప్రయివేటీకరణ యోచన లేదు-శౌరి

20 పెట్రోడీలర్‌షిప్‌ల రద్దు చెల్లదు - సుప్రీం
జార్ఖండ్‌లో ఎం.సి.సి. చేతుల్లో 20 మంది పోలీసుల బలి

23 దేశమంతటా గుజరాత్ ప్రయోగం- వెంకయ్యనాయుడు

24 జాయింట్ ఛీఫ్స్ ఆఫ్ స్టాఫ్ కమిటీ కొత్త చైర్మన్‌గా మాధవేంద్రసింగ్

25 "స్వజలధార" ప్రధాని ప్రారంభం

27 పన్నులపై కేల్కర్ కమిటీ తుది సిఫార్సులు

28 రామజన్మభూమి అప్పగించడానికి 22 ఫిబ్రవరి గడువు-వి.హెచ్.పి.

30 రాష్ట్ర గవర్నర్‌గా బర్నాలా

---

(17 పేజీ తరువాయి)

కనీస అవసరాలు కూడా లేవు. ఎక్కడో మారుమూలన ఏర్పాటు చేసినా, హాస్టల్ సౌకర్యం అసలు కనపడదు. మహిళా విద్యార్థుల పరిస్థితి ఇంకా దయనీయం. అనేక కాలేజీలకు తగిన రవాణా సౌకర్యాలు లేవు. గ్రామీణ ప్రాంతాలలో వున్న కాలేజీల విద్యార్థులు శని, ఆదివారాలలో నగరానికొచ్చి ట్యూషన్స్ ద్వారా పాఠాలు చెప్పించుకొని మళ్ళీ సోమవారం వెనక్కు వెళ్లే స్థితి చాలా చోట్ల వుంది. పరీక్షలలో విద్యార్థులు "కాపీ" చేయడానికి పాల్పడుతున్నారు. లోపాయికారీగా ప్రిన్సిపాల్స్, బోధనాసిబ్బంది, యాజమాన్యం సహకరిస్తున్నట్లు సమాచారం. దీనికి కారణం లేకపోలేదు. "వేలకు వేలు ఫీజులను అప్పులు చేసి చెల్లించినప్పటికీ ఓర్చి కాలేజీలకొస్తున్నమాకు సిబ్బంది లేకుంటే మేము పాస్ కావాలికదా. మాకు మంచి మార్కులు రావాలి కదా" "కాపీలు అనుమతించకపోతే ఎలా" అని విద్యార్థులు ప్రశ్నిస్తున్నారు. ఇందుకు బాధ్యులెవరు?

సాంకేతిక విద్యలో అనూహ్యమైన మార్పులొస్తున్నాయి. కానీ ఈ మార్పులకనుగుణంగా సిలబస్‌లో కానీ, బోధనా పరిశ్రమల మధ్య పరస్పర అవగాహన శూన్యం. అలాంటి అవకాశమున్న పరిశ్రమ లెక్కడున్నాయి? ఉన్న కొన్ని పరిశ్రమలు సరళీకరణ పుణ్యమా అని మూతపడిపోతున్నాయి. విద్యార్థులు పరిశ్రమలలో గడిపే స్థితి లేదు. వారు చేసే ప్రాజెక్ట్స్ మొక్కుబడిగా వున్నాయేగాని, అందులో ఏమాత్రం "పస"లేదు. అవికూడా గతంలో ఎవరో చేసినవే అటు. ఇటుగా మార్చి సొంతం చేసుకొంటున్నవే. వేలకొద్దీ విద్యార్థులకు నామమాత్రంగా వున్న పరిశ్రమలు ఎక్కడ అవకాశం కల్పించగలవు? అలాగే కనీస వసతులు లేనప్పుడు, నూతనావసరాలకు పొకడలకు స్థానమెక్కడుంది? అనుభవమున్న ప్రొఫెసర్స్‌ను నియమిస్తే ఎక్కువ తగినంత జీతం ఇవ్వాల్సి వస్తుందోనని కనీస అర్హతలు లేని లెక్చరర్లతో పాఠాలు బోధిస్తున్నాయి.

ఇలాంటి దయనీయస్థితిలో వున్న మన సాంకేతిక విద్యతో ప్రపంచంలోనే అత్యున్నత ప్రమాణంతో కూడిన నైపుణ్యాన్ని ఎలా అభివృద్ధి పరచగల యువతలో భ్రమలు కల్పించి వారి భవిష్యత్తును అంధకారం చెయ్యడం ఎంతవరకూ న్యాయం! ❑

## వినదగు నెవ్వరు చెప్పిన...

* ప్రజాస్వామ్యం పేరుతో ప్రజాస్వామ్యాన్ని అంతం చేసే ప్రయత్నమే ప్రపంచీకరణ

**- అమియ కుమార్ బాగ్చీ, ఆర్థిక శాస్త్రవేత్త**

* 20 వ శతాబ్దంలో చంపివేయబడ్డ 20.90 కోట్ల మందిలో 80 లక్షల మంది మత సంబంధమైన కొట్లాటల్లో మరణించగా, 16.90 కోట్ల మంది ప్రభుత్వాల చేతుల్లో మరణించారు. ఇందులో ఎక్కువ మంది దేశ రక్షణ పేరుతో చంపబడ్డారు.

**- అశీష్ నంది, సెంటర్ ఫర్ స్టడీ ఆఫ్ డెవలపింగ్ సొసైటీ**

* విద్య, వైద్యం లాంటి సేవలను ప్రభుత్వం స్పెషలిస్టులు, ప్రొఫెషనల్స్‌కు వదలిపెట్టడమంటే, ఆ విషయాలను ప్రజాస్వామ్య కంట్రోల్ నుంచి తప్పించడమే.

**- అశీష్ నంది**

* వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థను సరిదిద్దడానికి వ్యవస్థాగత సర్దుబాట్లు అమలు అవుతున్నాయి. అదే సమయంలో వర్ధమాన దేశాల రుణాలూ పెరుగుతున్నాయి.

**- హో కియో హో, కొరియా**

* 25 సంవత్సరాల వయస్సు గల దళిత స్త్రీ ధాక్రీ అంటోంది కదా: ఢిల్లీలో ముష్టి ఎత్తుకోవడం నిషేధం. అయితే బతకడానికి ప్రత్యామ్నాయం లేదు. అడుక్కునే హక్కూ లేదు. పని హక్కు లేదు. బతకడానికి హక్కుందా?

**- ది హిందూ 5 జనవరి 2003**

* వ్యాపారనిబంధనలు, నియమాలు, అభివృద్ధి చెందిన దేశాలకు అనుకూలంగా వుండడం వలన వర్ధమాన దేశాలకు సహాయంగా తీసుకొన్న ప్రతీ ఒక్క డాలరుకు, తిరిగి రెండు డాలర్లు చెల్లిస్తున్నాయి.

**- ఆక్స్‌ఫామ్, న్యూస్ టైమ్, 5 జనవరి, 2003**

* అభివృద్ధి చెందిన దేశాలు వర్ధమాన దేశాలను సబ్సిడీలకు కోత విధించాలని చెబుతూ తాము సబ్సిడీ పేరుతో రోజుకు 10 లక్షల డాలర్లు చెల్లిస్తున్నారు.

**- ఆక్స్‌ఫామ్**

* హింసలో పాలకుల స్వప్రయోజనం వుంది. హింస ఆగిపోతే, ప్రజల సమస్యలు ముందుకు వస్తాయి. వాటిని పరిష్కరించాల్సి వస్తుంది? అందుచేత ప్రజల దృష్టిని వారి సమస్యలనుంచి మళ్లించాలంటే హింస జరుగుతూండాలి. నక్సల్స్ వైపు, వారి హింస వైపు చూపించి వీళ్ల వయూలానే అభివృద్ధి ఆగిపోతుంది, మీ సమస్యలు పరిష్కరించలేకపోతున్నాం అని చెప్పవచ్చు. అందుచేత సమాజంలో హింస జరుగుతుండడం పాలకులకు అవసరం.

**- సమీర్ అమీన్, ప్రముఖ ప్రపంచ ఆర్థిక శాస్త్రవేత్త**

* నవరత్నాలుగా పేర్కొన్న ప్రభుత్వ రంగ పరిశ్రమలనుంచి ప్రభుత్వం తన ఈక్విటీని ఉపసంహరించుకోకుండా, వాటిని స్వతంత్ర కార్పొరేషన్లుగా ఏర్పాటు చేసి, అనుభవజ్ఞులైన యాజమాన్యాలను నియమించాలి. ప్రజలు ఈ పరిశ్రమల్లో షేర్లు కొనడానికి అవకాశమివ్వాలి.

**- ఎ.సి.ముత్తయ్య, ఫిక్కీ అధ్యక్షులు.**

* అర్జంటైనాలాగే భారతదేశం కూడా ప్రపంచ బాంకునుంచి మితిమీరి అప్పులు చేయకూడదు. అలాచేస్తే రుణం, మరింత రుణం, వడ్డీల విషయంలో చిక్కుకొనిపోతుంది. అది దేశాల ప్రాణాలను హరించి వేస్తుంది. విదేశాలనునుంచి రుణాలు తీసుకోవాల్సిన అవసరం ఏ దేశానికీ లేదు. ధనం సరిగా పంపిణీ జరిగితే, ఉన్న వనరులను జాగ్రత్తగా ఉపయోగించగలిగితే అందరికీ అవసరమైనంత లభిస్తుంది.... ప్రజలు ఈ రుణాలు చెల్లించకూడదు. రుణాలు తీసుకొన్నది వాళ్లు కాదు: ప్రభుత్వం. వారి రాజకీయ రుణం చేసింది. ప్రజల అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా చేసిన రుణాలకు వారెలా బాధ్యులౌతారు?

**- మదర్స్ ఆఫ్ మే ప్లాజా అర్జంటైనా సంస్థ స్థాపకురాలు నోరాడీ కోర్టినాస్**

---

(12 పేజీ తరువాయి)

కదా అని ఎవరైనా అనవచ్చు. పేదవారికి ఎంత లభించిందో. ప్రణాళిక సంఘమే తమ మధ్యంతర సమీక్షలో ఇలా చెప్పింది. "జాతీయ స్థాయిలో రేషన్ షాపులనుంచి 36 శాతం గోధుమ, 31 శాతం బియ్యం, 23 శాతం పంచదార చౌప్పున ధరల దుకాణాలనుంచి పక్కదారి పట్టాయి. ఉత్తర భారతం, ఆగ్నేయ ప్రాంత రాష్ట్రాల్లో చవుక ధరల దుకాణాలు సరిగ్గా పనిచేస్తున్నట్లు లేదు. ఉత్తరప్రదేశ్ బీహార్, అస్సాం, రాష్ట్రాలకు ఎక్కువ కేటాయింపులు జరిగినా, దుకాణాలనుంచి కొనుక్కునే నాధులు కరువయ్యారు. కాగా ఆ ప్రజలపై పోషకాహాకార విలువల ప్రభావం లేదు". ప్రభుత్వం ఎంత సొమ్ము సబ్సిడీగా ఇచ్చింది, అంత విలువగల ఆహార కూపన్లను పేదవారికి ఇచ్చివుంటే, వారి పరిస్థితి బాగుపడివుండేది. దేశమంతటా గోదాముల నెట్‌వర్క్‌ను ప్రభుత్వం ఏర్పాటు చేస్తే రైతులు అక్కడ కనీస ధరకు అమ్ముకోవచ్చు. ఆహారధాన్యాలు ప్రభుత్వానికి చెందుతాయి. ప్రభుత్వమే ఈ గోదాముల వద్ద అమ్మకం చేయవచ్చు.

వ్యవసాయాన్ని యాంత్రికీకరణ చేయటం చిన్న కమతాలున్న రైతుల శక్తికి మించినదనే అభిప్రాయం సరికాదు. అంతే చిన్న కమతాలలో వుపయోగించగలిగే చిన్న పవర్ టిల్లర్లు జపాన్, ఆగ్నేయాసియా దేశాల్లో మన దేశంలో కన్నా ఎన్నో ఎక్కువ రెట్లు తక్కువ ధరలకు లభ్యమవుతున్నాయి. ఈ యంత్రాలను, లాంఛన కస్టమ్స్ సుంకంతో దిగుమతి చేసుకుంటే, వాటి ఖరీదు చిన్న కమతాల రైతులకు అందుబాటులో వుంటాయి. (సంక్షిప్త స్వేచ్ఛానువాదం)

□